SHAHADAT - E - HAQUE
(Telugu)



# సాక్ష్యం

## మానవాళి సమక్షంలో



మూలం :
మౌలానా సయ్యద్ అబుల్ ఆలా మౌదూది (రహ్మాలై)

అనువాదం :
ఎస్సెమ్ ఖాద్రి






తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్
లక్కడ్‌కోట్, చత్తా బజార్,
హైదరాబాదు - 500 002

# మా మాట

ముస్లిములు ప్రపంచంలోని అనేక మతావలంబీకుల్లా ఓ మతాన్ని ఆశ్రయించినవారు. ప్రపంచంలోని అనేక జాతుల్లా ఓ జాతి ప్రజలు అన్న అపోహ సర్వసామాన్యంగా వ్యాప్తిలో ఉంది. ఇస్లాం అన్ని మతాల్లా ఓ మతమన్న అపార్థమూ ప్రబలి ఉన్న మాట కూడా వాస్తవమే. ఈ దురభిప్రాయాలను దూరం చేసి ఇస్లామ్ ఎలాంటి మతమో, ముస్లిములు ఏ భావంలో ఒక జాతియో విడమర్చి చెప్పిన తొలి ఆధునిక ఇస్లామీయ తత్త్వవేత్త మౌలానా సయ్యిద్ అబుల్ అలా మౌదూది (రహ్మతుల్లా అలైహ్).

ఆయన మన సమకాలీన ఇస్లామీయ ధర్మవేత్తల్లో అగ్రగణ్యుడే కాదు, ఇరువయ్యో శతాబ్దంలో ఇస్లామ్‌ను దాని నిజ స్వరూపంలో ప్రపంచానికి పరిచయం చేసిన తత్త్వవేత్త. ముస్లిములు సాధారణ భావంలో జాతి కాదని వారు జాతీయ స్థాయిలో ప్రచారోద్యమ ధ్వజవాహకులని రుజువు చేసిన మహా మేధావి. ఇస్లామ్ ప్రపంచానికి శాంతిని ప్రసాదించే, మనిషికి మోక్షం అనుగ్రహించే ధర్మమయితే ముస్లిములు ప్రపంచం ఎదుట దానికి సాక్ష్యంగా నిలువవలసిన ప్రజలు అని మౌలానా దివ్యఖుర్ఆన్ మరియు దైవ ప్రవక్త (సఅసం) బోధనల ఆధారంగా తెలిపారు. నేటి ధావుల్లా కేవలం సైద్ధాంతిక చర్చలు జరిపి అంతటితో తన బాధ్యత తీరిందని ఆయన భావించ లేదు.

తన సిద్ధాంతాలకనుగుణంగా దైవ ప్రవక్త (సఅసం) అడుగుజాడల్లో ఆచరణాత్మకంగా ఓ ఉద్యమాన్ని గట్టి పునాదులపై ప్రారంభించారు.

ఈ చిరు పుస్తకం ముస్లిముల నిజస్థానాన్ని, వారి బాధ్యతల్ని బోధపరిచేందుకు, ఉద్యమ మౌలిక సిద్ధాంతాన్ని విశదపరిచేందుకు ఉద్దేశించినది. ఆలస్యంగానయినా సరే దాన్ని తెలుగు ప్రజలకు అందజేస్తున్నందుకు మాకు ఎంతో ఆనందంగా ఉంది.

— ప్రకాశకులు

**అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో**

సకల స్తోత్రాలు విశ్వకర్త ప్రభువు స్వామి అయిన దైవానికే. ఆయన ఎంతో వివేచనతో, సామర్థ్యంతో, చాతుర్యంతో ఈ సృష్టిని పరిపాలిస్తున్నాడు. ఆయనే మానవుణ్ణి సృష్టించి, అతనికి బుద్ధీజ్ఞానాల శక్తుల్ని ప్రసాదించాడు. మానవుణ్ణి భువిలో తన ప్రతినిధిగా నియమించాడు. అతని మార్గదర్శకత్వానికి తన గ్రంథాల్ని, ప్రవక్తల్ని అవతరింపజేశాడు. మానవులకు మానవతను నేర్పడానికి వచ్చిన సకల సత్పురుషులు సజ్జనులపై దైవ కరుణ కురియుగాక, వారు మనిషికి అతని జీవితాశయమేదో తెలిపారు. అతనికి ప్రపంచంలో జీవితం గడిపే సరయిన మార్గం చూపెట్టారు. నేడు ప్రపంచంలో ఏ మాత్రం సన్మార్గ కాంతి కనిపించినా, సచ్ఛీలత పరిశుద్ధ ప్రవర్తనలు ఉన్నా అది కేవలం ఈ ఋజువర్తనులయిన దైవదాసుల మార్గదర్శకత్వం మూలాన్నే. వారి రుణాన్ని మానవాళి ఏ నాటికీ తీర్చుకోజాలదు.

మిత్రులారా! మేము మా ఈ సమావేశాలను రెండు భాగాలుగా విభజిస్తాము. ఒక భాగంలో మేము కూర్చుని మా కార్యకలాపాలను తనిఖీ చేసుకుంటాము. వాటిని పురోగమింపచేయటానికి పరస్పరం సలహా సంప్రతింపులు జరుపుకుంటాము. ఇది మా సమావేశాల్లో ఒక భాగం. రెండవ ఉద్దేశ్యం ఏమిటంటే, ఈ సమావేశం ఏ ప్రదేశంలో జరుగుతుందో ఆ ప్రాంతం ప్రజలకు మా సందేశాన్ని అందజేయడం. ఇప్పుడు జరుగుతున్న మా సమావేశం ఈ రెండవ కోవకు చెందింది.

మా సందేశం ఏమిటో మేము దేనివైపుకు ఆహ్వానిస్తున్నామో మీకు తెలుపటానికే నేడు మీకు ఈ శ్రమ కలిగించడం జరిగింది.

మా ఈ సందేశం లో మేము, ఒకటయితే ముందునుంచే ముస్లిములుగా ఉన్నవారిని, రెండవది ముస్లిములు కాని జన సామాన్యాన్ని సంబోధిస్తాము. మా వద్ద ఈ ఇరువర్గాలవారికీ వేర్వేరుగా ఒక్కో సందేశముంది. అయితే విచారకరమయిన విషయం ఏమంటే ఈ సమావేశంలో రెండవ వర్గంవారు కాన రావడం లేదు. దీనికి ముఖ్య కారణం మనం పూర్వం చేసిన తప్పులు, నేటి ప్రయత్నాల్లో లోపమూనూ, వీటి ఫలితంగానే దైవదాసులయిన మానవుల ఒక పెద్ద భాగం మనకు దూరమయి పోయింది. వారి దగ్గరకు పోయి లేక వారినే మన వద్దకు ఆహ్వానించి, మనకూ, వారికీ, అందరికీ చెందిన దైవం తన ప్రవక్తల ద్వారా మనందరి మార్గదర్శకత్వానికిగాను పంపిన సందేశం వినిపించే అవకాశం మనకు కలగటం బహు అరుదు. ప్రస్తుతం వారు ఇక్కడ లేరు కనుక మా సందేశంలో కేవలం ముస్లిముల కోసమే ప్రత్యేకమయిన భాగాన్ని నేడు మీ ముందు ఉంచుతున్నాను.

ముస్లిములను మేము ఏ విషయం వైపుకయితే ఆహ్వానిస్తున్నామో అది ఏమంటే, వారు ముస్లిములుగా తమపై మోపబడిన బాధ్యతల్ని అర్థం చేసుకోవాలి, వాటిని నిర్వర్తించాలి. మేము ముస్లిములమని, దైవాన్ని ఆయన మార్గాన్ని స్వీకరించిన వారమని మాత్రమే చెప్పేసి మీరు తప్పించుకోలేరు. మీరెప్పుడయితే దైవాన్ని మీ దైవంగా, ఆయన ధర్మాన్ని మీ ధర్మంగా

స్వీకరించారో అప్పుడే మీపై కొన్ని ప్రత్యేక బాధ్యతలు కూడా మోపబడ్డాయి, వాటిని మీరు గుర్తించాలి. వాటిని నిర్వహించే ఆలోచన మీలో కలగాలి ఒకవేళ వాటిని నిర్వహించకపోతే వాటి దుష్ఫలితాలను మీరు తప్పక చవిచూడవలసిందే– ఇహ లోకంలోనూ, పరలోకంలోనూ ఆ బాధ్యతలేమిటి? బాధ్యత అంటే మీరు దైవాన్ని, దైవదూతల్ని, దైవ గ్రంథాలను. దైవ ప్రవక్తల్ని, పరలోక జీవితాన్ని విశ్వసించటం మాత్రమే కాదు. కేవలం నమాజ్ చెయ్యడం, ఉపవాస వ్రతం పాటించడం, జకాత్‌నివ్వటం, హజ్ చేయడం కూడా కాదు. అవి, కేవలం వివాహం, విడాకులు, వారసత్వపు విషయాల్లో మీరు ఇస్లాం నిర్ణయించిన నియమాలను అమలుపరచటం వల్ల కూడా నెర వేరవు. అయితే వీటన్నింటినీ మించిన మహా గొప్ప భారీ బాధ్యత మీపై మోపబడింది. అదేమంటే మీరు విశ్వసించిన సత్యానికి ఈ ప్రపంచం సమక్షంలో మీరు సాక్ష్యమివ్వాలి. మిమ్మల్ని "ముస్లిం" అనే పేరుతో ఒక శాశ్వత సమాజంగా నిర్మించే ఏకైక లక్ష్యాన్ని దివ్య ఖుర్‌ఆన్ వివరిస్తూ మీరు యావత్తు మానవాళి ఎదుట తిరుగులేని విధంగా సత్యానికి సాక్ష్యం పలకాలని నుడివింది.

"ఈ విధంగా మిమ్మల్ని మధ్యస్థ సమాజంగా చెయ్యడం జరిగింది — మీరు ప్రజలకు సాక్షులుగా నిలవాలని, ప్రవక్త మీకు సాక్షిగా నిలవాలనీను." (2 : 143)

మీ సమాజం యొక్క అసలు లక్ష్యం ఇదే. దాన్ని నిర్వర్తించకపోతే మీరు మీ జీవితాన్నే వ్యర్థం చేసినట్లు. ఇది దైవం మీపై మోపిన విధి. ఈ విషయంలో దైవాజ్ఞ ఈ

విధంగా ఉంది: "విశ్వసించిన ప్రజలారా! దైవం కోసం నిలబడేవారుగా, న్యాయమయిన, సరిఅయిన సాక్ష్యమిచ్చే వారుగా రూపొందండి." (5 : 8) ఇది కేవలం ఆదేశం మాత్రమే కాదు, తాకీదుతో జారీ అయిన ఆదేశం. ఎందుకంటే దైవాదేశం ప్రకారం: "ఎవరివద్దనయితే అల్లాహ్ పంపిన సాక్ష్యం ఉండగా అతను దాన్ని దాచివేస్తాడో అతనికంటే దౌర్జన్యపరుడు మరెవడు కాగలడు?" (2 : 140) ఈ విధంగా ఈ విధిని మీరు నిర్వహించకపోతే కలిగే పర్యవసానమేమిటో అల్లాహ్ మీకు తెలిపాడు మీకు పూర్వం ఈ సాక్ష్యపు బోనులో యూదుల్ని నిలబెట్టడం జరిగింది. కాని వారు కొంతవరకు సత్యాన్ని దాచారు. కొంతవరకు సత్యానికి వ్యతిరేకంగా సాక్ష్యమిచ్చారు. మొత్తానికి వారు సత్యానికి బదులుగా అసత్యానికే సాక్షులుగా నిలిచారు. ఫలితంగా అల్లాహ్ వారిని ఛీత్కరించాడు. వారు అల్లాహ్ ఆగ్రహానికి గురి అయ్యారు.

"వారిపై పరాభవం, పరాధీనత, పతనం, దౌర్జన్యాలు తిష్ఠవేశాయి. ఇంకా వారు అల్లాహ్ ఆగ్రహానికి లోనయ్యారు" (2 : 61)

మీపై మోపబడిన ఈ సాక్ష్యబాధ్యతకు భావమేమంటే ఏ సత్యమయితే మీ వరకు చేరిందో, ఏ యదార్థమయితే మీకు ప్రస్ఫుటం చెయ్యడం జరిగిందో, మానవ సాఫల్యం, మోక్షాలకు ఏ ఏకైక మార్గమయితే మీకు చూపడం జరిగిందో, అది ధర్మమయినదని, సత్యమయినదని మరియు అదే ఋజుమార్గమని వారు ప్రపంచం సమక్షంలో సాక్ష్యం పలకాలి, మీ సాక్ష్యం అది ధర్మమయినదని, నిజమయినదని బహిరంగపరచాలి.

ప్రపంచ ప్రజలకు ధర్మం అందజేయబడిందన్న వాదనను పరిపూర్ణం చెయ్యాలి. ఈ సాక్ష్యం పలకడానికే ప్రవక్తలందరూ ప్రపంచంలో ప్రభవింపజేయబడ్డారు. దాన్ని నిర్వర్తించడం వారికి విధిగా చెయ్యబడింది.

ఈ సాక్ష్యం ఇవ్వడమే ప్రవక్తలందరి తరువాత వారి అనుచర సమాజాలకు విధిగా నిర్ణయమవుతూ వచ్చింది. చివరకు ఈ విధి, అంతిమ ప్రవక్త మహనీయ ముహమ్మద్ (సఅసం)తరువాత ఆయన అనుచరులయిన ముస్లిం సమాజంపై మోపబడింది. ఆయన జీవిత కాలంలో వ్యక్తిగతంగా ఆయనపై ఏ విధంగా ఇది విధి అయినదో అదే విధంగా ముస్లిం అనుచర సమాజం మొత్తం ఇప్పుడు ఆ బాధ్యతను నిర్వహించవలసి ఉంది.

ఈ సాక్ష్యం యొక్క ప్రాముఖ్యతను అర్థం చేసుకోడానికి దీన్ని గమనించండి: అల్లాహ్ మానవాళి కొరకు, పరలోకంలో ప్రశ్నించడం, బహూకరించడం, శిక్షించడం కోసం నిర్ణయించిన నియమం అంతా ఈ 'సాక్ష్యం'పై ఆధారభూతమయి ఉంటుంది అల్లాహ్ వివేచనాదక్షుడు, కరుణామయుడు, న్యాయశీలుడు. అయితే ప్రజలకు ఆయన అభీష్టమేదో తెలియకుండా, ఆయన అభీష్టానికి వ్యతిరేకంగా మెలిగినందుకు పట్టుకోవడమన్నది; ఋజుమార్గమేదో ప్రజలకు తెలియకుండానే వారు పెడమార్గం పడితే వారిని ప్రశ్నించడమన్నది; ఇంకా ఆయన దేన్ని గురించి ప్రశ్నిస్తాడో ప్రజలకు ఏ మాత్రం తెలియకుండా ఆయన ఆ తెలియని విషయం గురించి వారిని అల్లాహ్ ప్రశ్నించడ

మన్నది ఆయన వివేచనకు, కారుణ్యానికి, న్యాయశీలతకు పొసగదు. అందువల్ల అల్లాహ్ సృష్టిని ప్రారంభించడమే ఓ ప్రవక్త ద్వారా చేశాడు. ఆ తర్వాత సమయానుకూలంగా మానవుల్ని జాగృతపరచడానికి, వారి విషయంలో వారి స్వామి ప్రభువు అభీష్టమేదో, ప్రపంచంలో వారు జీవితం గడిపే సరయిన విధానమేదో, ఏ వైఖరి వల్ల వారు తమ స్వామి ప్రసన్నత పొందగలరో, ఏ పనులు చెయ్యాలో, ఏ పనులకు దూరంగా ఉండాలో, ఏ విషయాల్లో వారిని ప్రశ్నించడం జరుగుతుందో తెలుపడానికి అసంఖ్యాకంగా ప్రవక్తల్ని ప్రభవింపజేశాడు అల్లాహ్. అల్లాహ్ తన ప్రవక్తల ద్వారా ఇప్పించిన ఈ సాక్ష్యానికి ఉద్దేశ్యం, దివ్య ఖుర్ఆన్‌లో స్పష్ట పరచినదేమంటే, రేపు ప్రళయదినాన ప్రజలు, మాకు ఏదీ తెలియదు, మాకు తెలిని విషయాన్ని గురించి మమ్మల్ని మీరు ప్రశ్నిస్తున్నారు అని వాదించే అవకాశం వారికి మిగల రాదన్నదే.

"ప్రవక్తలందరూ శుభవార్తనిచ్చేవారు, హెచ్చరించే వారుగా పంపబడ్డారు. తద్వారా, వారి ప్రభావానికి పిదప ప్రజలకు ఎలాంటి వాదనావకాశం ఉండరాదని, అల్లాహ్ మెత్తానికి ఆధిక్యత గలవాడు, వివేచనాదక్షుడు. (4:165)

ఈ విధంగా దైవం ప్రజల వాదాన్ని తనపై లేకుండా ప్రవక్తలపై వేశాడు. ఇక ప్రవక్తలందరూ ఈ ముఖ్యమయిన బాధ్యతపై నిలబడ్డారు. ఈ సత్య సాక్ష్యబాధ్యతను సక్రమంగా నిర్వర్తిస్తే ప్రజలే తమ కర్మలకు జవాబు చెప్పుకునేందుకు బాధ్యు

లవుతారు. అలాకాక సాక్ష్యమిచ్చే బాధ్యత నిర్వహణలో లోపం జరిగి ఉన్నట్లయితే ప్రజల మార్గవిహీనతకు ఆ ప్రవక్తలు జవాబు చెప్పుకోవలసి ఉంటుంది. మరో విధంగా చెప్పా లంటే ప్రవక్తల బాధ్యత అతి సున్నితమయినది దాని ప్రకారం వారు సత్యానికి సాక్ష్యమిచ్చే బాధ్యతను సవ్యంగా నిర్వర్తించి ప్రజలపై తమ వాదనను నిలబెట్టుకోగలగాలి, లేకపోతే ప్రజల వాదన వారికి వ్యతిరేకంగా ఎదురవుతుంది. ఆ వాదన "దైవం ఏ యదార్థ జ్ఞానాన్నయితే మీకిచ్చి పంపిం చాడో దాన్ని మీరు మాకు అందజెయ్యలేదు. ఏ సరయిన జీవన విధానం ఆయన మీకు తెలిపాడో దాన్ని మీరు మాకు తెలుపలేదు" అని తలెత్తుతుంది. అందువల్లనే ప్రవక్తలు (అస) తమపైనున్న ఈ బాధ్యతా భారాన్ని ఎంతో తీవ్రమయినదిగా పరిగణించేవారు. ఆ కారణం చేతనే సత్యసాక్ష్యం ఇవ్వడం లోనూ, ప్రజలపై పూర్తిగా తమ వాదనను పూర్తిగా స్పష్టం చేయటంలోనూ శాయశక్తులా కృషిచేసేవారు. ఆ తరువాత ప్రవక్తల (అస) ద్వారా ఎవరయితే సత్యజ్ఞానాన్ని, సన్మార్గాన్ని పొందారో వారంతా ఒక సమాజంగా రూపొందించబడ్డా ఇప్పుడు ప్రవక్తలపై వేయబడిన సత్యానికి సాక్ష్యంగా నిలిచే బాధ్యత ఈ అనుచర సమాజంపై మోపడం జరిగింది. ప్రవక్తల స్థానంలో నిలువడంచేత, అది సాక్ష్యమిచ్చే బాధ్య తను నిర్వర్తించాలి. అప్పుడు ప్రజలు సన్మార్గాన్ని అవలం బించకపోతే ఈ సమాజం సత్ఫలితాన్ని పొందుతుంది. ప్రజలు పట్టుకోబడతారు

సాక్ష్యమివ్వడంలో అలక్ష్యం కనబరిస్తే లేక సత్యానికి బదులుగా అసత్యానికి సాక్ష్యమివ్వసాగితే ఇతరులకు ముందు ఇదే పట్టుబడుతుంది. సమాజాన్ని స్వయంగా దాని కర్మలను గురించి ప్రశ్నించడమూ జరుగుతుంది. పైపెచ్చు ఇది సరైన సాక్ష్యం ఇవ్వకపోవడంచేత లేక తప్పుడు సాక్ష్యం ఇవ్వడంచేత మార్గవిహీనులయిన, కల్లోలజనకులయిన, దుర్వర్తనులయిన ప్రజల కర్మలను గురించి కూడా ఇది జవాబు చెప్పుకోవలసి ఉంటుంది.

మహాశయులారా !

ఇదీ నాపై, మీపై మరియు ముస్లిమ్ సమాజం అనబడే వారిపై, దైవ గ్రంథం, ప్రవక్తల మార్గదర్శకత్వం పొందిన వారందరిపై మోపబడిన మహత్తరమయిన బాధ్యత. ఇక ఈ సాక్ష్య బాధ్యతను నిర్వర్తించే పద్ధతి ఏమిటో చూద్దాము. సాక్ష్యం రెండు విధాలు ; ఒకటి మాటల ద్వారా, రెండవది చేతల ద్వారా. మాట లేక వాక్కు ద్వారా అంటే ఏ సత్యం అయితే దైవ ప్రవక్తల ద్వారా మనకు అందిందో దాన్ని గురించి మనం నోటి ద్వారా కలం ద్వారా ప్రపంచానికి చాటి చెప్పాలి. హృద్యంగా బోధపరచటానికి ఎన్ని పద్ధతుల ద్వారా సాధ్యమవుతుందో వాటన్నిటినీ ఉపయోగించి, సందేశ ప్రచారాలు, ప్రసార ప్రచురణల మార్గాలు ఎన్నెన్ని సాధ్యమవుతాయో వాటినన్నిటినీ వినియోగించి, కళలు, విద్యలు ఎంతమేరకు మూల విషయాన్ని అందజేశాయో దాన్నంతా చేత బూని దైవం మానవులకై నిర్ణయించిన ధర్మాన్ని జీవన

విధానాన్ని, దాని బోధనల్ని మనం ప్రపంచానికి తెలియ జేయాలి, ఆలోచన విశ్వాసాల్లోనూ, నైతికత శీల నిర్మాణంలో నాగరికత సంస్కృతుల్లో, ధనార్జనలో, ఇచ్చిపుచ్చుకోవడాల్లో చట్టం న్యాయవ్యవస్థలో, రాజకీయాలు పరిపాలనా విధానాల్లో ఇంకా మానవుల మధ్య ఏర్పడే పరస్పర సంబంధాల అన్ని కోణాల్లో ఈ ధర్మం మానవ మార్గదర్శకత్వానికి ప్రతిపాదించిన దంతా మనం విడమర్చి చెప్పాలి. ఆధారాలు, నిదర్శనలతో సహా అదే సవ్యమయినదని, సత్యమయినదని నిరూపించాలి దీనికి భిన్నమైన ప్రతి విషయాన్ని సహేతుకమయిన విమర్శ ద్వారా అందులో ఉన్న లోపం ఏదో చూపాలి. ఈ వాక్కు సాక్ష్యం సరిగ్గా నిర్వర్తించబడాలంటే, దైవ ప్రవక్తలు వ్యక్తి గతంగా ఏ విధంగానయితే మానవులు ఋజుమార్గం పొందాలని ఆవేదనాపూరితంగా కృషిసలిపేవారో అదే విధంగా ముస్లిమ్ సమాజం అంతా సామూహికంగా దీనికొరకు తపన అనుభవిం చాలి ఈ బాధ్యతా నిర్వహణ సరిగ్గా జరగాలంటే ఈ కార్యం మన సామూహిక ప్రయత్నాలకు, సామాజిక స్థాయిలో జరిగే మన శారీరక కృషికి కేంద్ర బిందువు కాగలగడం అవసరం. మనం మన మేధా ప్రతిభను, మానసిక శక్తుల్ని మన సాధనా సంపత్తినంతటినీ దీనికై వినియోగించాలి. మనం చేసే ప్రతి పనిలోనూ ఈ లక్ష్యం తప్పనిసరిగా దృష్టిలో ఉండాలి. మన మధ్య ఈ సత్యానికి వ్యతిరేకంగా ఎలాంటి మాట లేవనెత్తడాన్ని ఎట్టి పరిస్థితిలోనూ మనం సహించరాదు

ఇక దేవతల ర్వారా అంటే క్రియాత్మక సాక్ష్యం. దాని భావమేమంటే మనం సత్యం అని భావించే సూత్రాలను చేతల

ద్వారా మనం మన జీవితాల్లో అభివ్యక్తం చెయ్యాలి. ప్రపంచం కేవలం మన నోటితో వాటి సత్యత ప్రస్తావన వినడం మాత్రమే కాదు, మన జీవితాల్లో వాటి ద్వారా ఏర్పడే మంచినీ, శుభాలనూ తన కళ్ళతో చూడాలి. విశ్వాసంలోని మాధుర్యం వల్ల మనిషి ప్రవర్తనలో, వ్యవహారాల్లో పుట్టుకువచ్చే తీయదనాన్ని ప్రపంచం మన నడవడిలో ఆస్వాదించాలి. ఈ ధర్మం మార్గదర్శకత్వంలో ఎలాంటి ఉత్తమ వ్యక్తులు తయారవుతారో ఎలాంటి న్యాయశీలమయిన సంఘం ఏర్పడుతుందో, ఎలాంటి సత్సమాజం ఉనికిలోకి వస్తుందో, ఎలాంటి పరిశుద్ధమయిన, పవిత్రమయిన సంస్కృతి ఉద్భవిస్తుందో, సాహిత్యం, కళలు, విద్యలు ఎంత సవ్యమయిన మార్గంలో వృద్ధివికాసాలు చెందుతాయో, ఎలాంటి న్యాయవంతమయిన, సానుభూతి నిండిన, వివాదరహితమయిన ఆర్థిక సహకార వాతావరణం ఏర్పడుతుందో, వ్యక్తిగత, సామూహిక జీవితాలు ప్రతి కోణంలోనూ ఏ విధంగా సంస్కరించబడతాయో తద్వారా జీవితం ఎలా సకల శుభాల సరోవరంగా రూపొందుతుందో ప్రపంచం గ్రహించగలగాలి. మన ధర్మం యొక్క సత్యత పట్ల మనం వ్యక్తిగతంగానూ, జాతీయ స్థాయిలోనూ మూర్తీభవించిన సాక్ష్యంగా మారినప్పుడే ఈ సాక్ష్యం ఇచ్చే హక్కు నెరవేరుతుంది. మన వ్యక్తుల స్వరూపస్వభావాలు ఈ సత్యాన్నే నిరూపించేదిగా ఉండాలి. మన గృహాలు ఈ సత్య సౌరభంతో ఘుమఘుమలాడాలి, మన దుకాణాలు, మన కార్ఖానాలు సతతం ఈ సత్యం వెలుగుతోనే కళకళలాడాలి. మన సంస్థలు, పాఠశాలలు ఈ సత్య జ్యోతితో కాంతులీనాలి. మన

సాహిత్యం. మన పత్రికా రచన (జర్నలిజం) దీని గొప్పదనాన్ని ధృవపరిచేదిగా ఉండాలి. మన జాతీయ విధానం, మన సామూహిక కృషి అంతా దీని సత్యతకు అద్దం పట్టాలి. మొత్తానికి మనకు ఎప్పుడు, ఏ స్థితిలోనయినా, ఏ వ్యక్తి లేక ఏ జాతి అయినా తటస్థిస్తే వారు మన వ్యక్తిగత జాతీయస్వరూప స్వభావాల ద్వారా మనం దేన్నయితే సత్యం అంటామో అది వాస్తవంగానే సత్యమనీ, దాని ద్వారా వాస్తవంగానే మానవ జీవితం సంస్కారవంతమూ, ఉన్నతమూ కాగలదన్న విషయానికి రుజువును చూడగలగాలి. ఈ సాక్ష్యం పరిపూర్ణమవడానికి ఒక రాజ్యం ఈ సూత్రాల ఆధారంగా ఏర్పడి, అది ధర్మాన్ని పరిపూర్ణంగా అమలు జరిపి, తన న్యాయశీలత ద్వారా తన సంస్కరణా కార్యక్రమం ద్వారా, తన ఉత్తమ పరిపాలన ద్వారా. తన శాంతిభద్రతల ద్వారా, తన ప్రజల సంక్షేమం ద్వారా, తన పరిపాలకుల ఉత్తమ శీలం ద్వారా, సంస్కారవంతమయిన తన అంతరంగ రాజకీయాల ద్వారా, నిజాయితీ నిండిన విదేశీ నీతి ద్వారా, ఉదాత్తమయిన యుద్ధనీతి ద్వారా, నీతిమంతమయిన సంధి ద్వారా, ప్రపంచం సమక్షంలో సాక్ష్యమివ్వాలి— ఏ ధర్మమయితే ఈ రాజ్యాన్ని నెలకొల్పిందో అది వాస్తవంగానే మానవ సంక్షేమానికి గ్యారంటీనిస్తుందని, దాని అనుసరణలోనే మానవ శ్రేయం ప్రాప్తం కాగలదనీను. ఈ సాక్ష్యం, మాటల ద్వారా సాక్ష్యంలో కలిసినపుడు ముస్లిమ్ సమాజంపై మోపబడిన బాధ్యత నెరవేరుతుంది. అప్పుడే మానవాళికి సత్యాన్ని అందజేసిన బాధ్యత పూర్తవుతుంది. అప్పుడే మన ఈ సమాజం, పరలోక న్యాయస్థానంలో ప్రవక్త

(సఅసం) తరువాత నిలబడి, మాకు అంతిమ ప్రవక్త(సఅసం) ద్వారా అందిన ఈ సత్యాన్ని మేం ప్రజల వరకు అందజేశామని సాక్ష్యం ఇవ్వగలుగుతుంది. ఆ తరువాత కూడా ఎవరయితే రుజుమార్గాన్ని స్వీకరించకుండా ఉంటారో వారు తమ మార్గ భ్రష్టత్వానికి స్వయంగా బాధ్యులు అవుతారు.

మాటల ద్వారా, చేతల ద్వారా ఇవ్వవలసిన సాక్ష్యం ఇది, కాని నేడు మనం వాస్తవంగా ఏ సాక్ష్యాన్ని ఇస్తున్నామో గమనించండి. మొదట మాటల ద్వారా సాక్ష్యాన్ని పరిశీలించండి. మనలో అతి స్వల్పమయిన ఒక వర్గం మాత్రమే వ్యక్తిగతంగాను, సామూహికంగానూ, నోటి ద్వారా, కలం ద్వారా ఇస్లామ్ సాక్ష్యాన్ని పలుకుతోంది. ఈ సాక్ష్యం ఏ రీతిలో ఇవ్వాలో ఆ రీతిలో సాక్ష్యాన్ని నిర్వర్తించేవారిని మనం వేళ్ళమీద లెక్కించవచ్చు. ఈ అల్ప వర్గాన్ని గనక మనం మన సమాజం నుండి వేరు చేస్తే సాధారణంగా ముస్లిములు ఇచ్చే సాక్ష్యం ఇస్లామ్‌కు అనుకూలంగా కాక దానికి వ్యతిరేకంగానే సాగుతుందని చెప్పవచ్చు. మన జమీందారులు, ఇస్లామ్ యొక్క వారసత్వపు చట్టం తప్పయినదని అజ్ఞానకాలంనాటి ఆచారాలే సరయినవని సాక్ష్యమిస్తున్నారు. మన న్యాయవాదులు, న్యాయాధిపతులు, ఇస్లామ్‌లోని శాసనాలన్నీ లోపభూయిష్టమయినవే అని, ఇస్లామీయ చట్టం యొక్క మౌలిక సిద్ధాంతమే ఒప్పుకోదగింది కాదు అని, కేవలం మానవులు నిర్మించుకున్న చట్టాలే సరిఅయినవని చెప్పకనే చెబుతున్నారు. పాశ్చాత్య నాస్తిక బోధనల నుండి గ్రహించిన, తత్వ విజ్ఞాన శాస్త్రాలు, చారిత్రక సామాజిక శాస్త్రాలు, ఆర్థిక రాజకీయ

సూత్రాలు, నీతి న్యాయాలకు సంబంధించిన సిద్ధాంతాలే సత్య మయినవని మన అధ్యాపకులు, ప్రొఫెసర్లు, విద్యాలయాలు సాక్ష్యం పలుకుతూ ఈ విషయాల్లో ఇస్లామీయ దృక్పథం ఏ మాత్రం పరిశీలించదగ్గది కూడా కాదని నిరూపిస్తున్నారు. అలాగే మన సాహితీవేత్తలు, అమెరికా, ఇంగ్లాండు, ఫ్రాన్స్ మరియు రష్యా నాస్తిక సాహిత్యకారుల మార్గ సాహిత్య సందేశమే తమ వద్ద కూడా ఉందని, తాము ముస్లిములయినందున సాహిత్య రంగంలో తమదంటూ ఏ ప్రత్యేకతా లేదని సాక్ష్యమిస్తున్నారు. మన పత్రికలు తమ వద్ద కూడా చర్చనీయాంశాలు, సమస్యలు మరియు ప్రచారాలకు ముస్లిమేతరులు అనుసరించే తీరుతెన్నులే తప్ప మరేమీ లేదని సాక్ష్యం పలుకుతున్నాయి. మన వాణిజ్య వేత్తలు, పారిశ్రామిక వేత్తలు, ఇస్లాం వ్యాపార వాణిజ్యాలకై నియమించిన పరిమితులు ఆచరణయోగ్యమైనవి కావని, ఇస్లామేతర పద్ధతుల ద్వారానే వ్యాపారం సాధ్యమని సాక్ష్యమిస్తున్నారు. మన నాయకుల సాక్ష్యమెలా ఉంది? తమ వద్ద ఉన్నవి కూడా ఇతరులు చేసే జాతితత్వం, దేశీయ వాదపు నినాదాలే అని, అవే జాతీయ లక్ష్యాలని, జాతీయ సమస్యల్ని పరిష్కరించే అవే విధానాలని, రాజకీయాలకు, రాజ్యాంగానికి దైవధిక్కారుల సూత్రాలే శరణ్యమని, ఇస్లామ్‌లో ఈ విషయాల పట్ల ఎలాంటి మార్గదర్శకత్వమూ లేదని వారు సాక్ష్యం చెబుతున్నారు.

ఇక మన ప్రజలు ఇచ్చే సాక్ష్యమో? వారి నోటికి ఏదైనా పని ఉందంటే అది, కేవలం ప్రపంచం దాని వ్యవహారాల ప్రస్తావన తప్ప మరేదీ లేదు. వారు చర్చించుకోడానికి,

ప్రస్థాపించుకోడానికి కొంత కాలాన్నయినా కేటాయించాలంటే వారికి అలాంటి ధర్మమేదీ లేదన్న విధంగానే వారు తమ నడవడి వల్ల సాక్ష్యమిస్తున్నారు. ఇదీ ముస్లిం సమాజం మన దేశంతో సహా ప్రపంచమంతటా పలుకుతున్న సాక్ష్యం.

ఇక ఆచరణాత్మక సాక్ష్యాన్ని చూస్తే దాని స్థితి మాటల ద్వారా పలికే సాక్ష్యం కన్నా అధ్వాన్నంగా ఉంది. అక్కడక్కడ కొంత మంది తమ తమ జీవితాల్లో ఇస్లామ్‌ను ప్రదర్శించే సత్పురుషులు మనకు కానవస్తారన్న విషయం యదార్ధమే. కాని ముస్లిమ్ సమాజం సర్వసాధారణ పరిస్థితి ఎలా ఉంది? వ్యక్తిగతంగా సామాన్య ముస్లిములు తమ ఆచరణ ద్వారా ప్రతిబింబింపజేసే ఇస్లామ్ ఏమంటే, ఇస్లామేతర వ్యవస్థల్లో తయారయిన వ్యక్తులకన్నా ఇస్లాం ఛాయల్లో పెరిగేవారి పరిస్థితి ఏ మాత్రం మెరుగ్గాను, భిన్నంగానూ లేదు. అనేక విషయాల్లో వారికన్నా హీనంగానే ఉన్నారు. వారు అబద్ధమాడగలరు. నమ్మకద్రోహం తలపెట్టగలరు, అన్యాయం చెయ్యగలరు, మోసం చెయ్యగలరు, మాటను తప్పగలరు. దొంగతనం లూటీలు చేయగలరు, కలహాలను సృష్టించగలరు, సిగ్గుమాలిన, నీతిబాహ్యమయిన పనులన్నిటికీ పాల్పడగలరు. ఈ చెడుగుల్లో వారి సగటు స్థితి ఇతర దైవధిక్కార జాతికంటే తక్కువ ఏమీ కాదు. అంతేకాదు, మన సామాజిక స్థితి, మన కట్టుబాట్లు, మన ఆచారవ్యవహారాలు, మన పెళ్ళిపేరంటాలు, మన ధార్మిక ఉత్సవాలు, ఉర్సులు, మన సభలు సమావేశాలు ఒకటేమిటి మన సామూహిక జీవనం యొక్క ఏ రంగంలోనూ ఇస్లామ్ సరయిన రీతిలో ప్రతిబింబించటం లేదు.

అంటే, ఇస్లామ్ అనుయాయులే స్వయంగా ఇస్లామ్‌కు బదులుగా అజ్ఞానపు రీతులకు ప్రాధాన్యతనిస్తున్నారనటానికి ఇదే ప్రత్యక్ష నిదర్శనం అన్న మాట.

మనం విద్యాలయాలను నెలకొలిపితే, విద్యను, విద్యా విధానాలను, విద్యా లక్ష్యాలను— అన్నింటినీ ఇతరుల నుండే గ్రహిస్తున్నాము. మనం సంఘాలను ఏర్పరిస్తే వాటి లక్ష్యాలను, వ్యవస్థను, విధానాలను అన్నీ ఇతరుల సంఘాల నుండే గ్రహిస్తున్నాము. మన సమాజం సామూహికంగా ఏదయినా కృషి చెయ్యడానికి లేచినప్పుడు దాని కోరికలు, కృషి చేసేవిధానం సంస్థ నిబంధనావళి, దాని తీర్మానాలు, ఉపన్యాసాలు మరియు ప్రకటనలు— అన్నీ అచ్చుగుద్దినట్లు ఇతర జాతుల ఫక్కీలోనే ఉంటాయి. చివరికి మన స్వతంత్ర లేక అర్ధ స్వతంత్ర ప్రభుత్వాలు ఉన్నచోట కూడా మనం, ప్రభుత్వ మూల విధానాలు, పరిపాలనా వ్యవస్థ మరియు చట్టాలు ఇతరులనుండే గ్రహిస్తున్నాం. అలాంటి కొన్ని ప్రభుత్వాల్లో ఇస్లామీయ చట్టాలు కేవలం "వ్యక్తిగత చట్టాలు" (**Personal Law**) వరకే మిగిలిపోతే ఇంకా కొన్ని ప్రభుత్వాలు వాటిలో కూడా తమ ఇష్టానుసారం హెచ్చుతగ్గులు చేయడానికి వెనుకాడటం లేదు. ఇటీవల ఒక ఆంగ్ల రచయిత **Lawrence Brown** తన గ్రంథం **The Prospects of Islam** లో మన గురించి ఈ విధంగా ఎత్తి పొడిచాడు·

"మేము భారత దేశంలో ఇస్లామ్ యొక్క సివిల్ మరియు క్రిమినల్ చట్టాలను పాతకాలం నాటివని, ఆచరణ

యోగ్యం కానివనీ వాటిని రద్దుచేసి ముస్లిముల కోసం కేవలం
వారి పర్సనల్ లాను మాత్రమే మిగిల్చినప్పుడు అది ముస్లిము
లకు రుచించలేదు. ఎందువల్లనంటే ఈ విధంగా వారి స్థితి
ఇస్లామీయ రాజ్యంలో జిమ్మీల(ముస్లిమేతర జాతులు)స్థితిలానే
తయారయింది. కాని ప్రస్తుతం భారతీయ ముస్లిములు దీన్ని
ఆమోదించడం మాత్రమే కాదు, స్వయంగా ముస్లిం రాజ్యాలు
కూడా ఈ విషయంలో మా విధానాన్ని అనుకరిస్తున్నాయి.
టర్కీ, అల్జీరియా దేశాలు ఇంకో అడుగు ముందుకువేసి
వివాహం, విడాకులు వారసత్వపు చట్టాల్లో కూడా మన
ప్రమాణాలకు అనుగుణంగా సవరణలు చేశాయి. దీనిద్వారా
చట్టాలకు మూలం దైవాదేశం అనే ముస్లిముల భావన కేవలం
ఒక పవిత్ర కథ (Pious fiction) కంటే ఎక్కువేం కాదు అన్న
విషయం తేలిపోయింది."

ఇదీ ప్రపంచ ముస్లిములందరు దాదాపు ఏకగ్రీవంగా
ఇస్లామ్‌కు వ్యతిరేకంగా ఇచ్చే ఆచరణాత్మక సాక్ష్యం! మనం
నోటితో ఏమని అన్నా మన సామూహిక ఆచరణ స్వయంగా,
ఈ ధర్మం యొక్క ఏ పద్ధతీ మాకు నచ్చటంలేదని ఈ
వ్యవస్థలో దీని శాసనాల్లో ఎలాంటి శ్రేయమైనా, ముక్తిఅయినా
మాకు గోచరించటంలేదని చాటుతోంది.

మనం అవలంబిస్తున్న—సత్యాన్ని మరుగుపరిచే, అసత్యపు
సాక్ష్యం పలికే—ఈ వైఖరి యొక్క పర్యవసానాన్ని మనం
అనుభవిస్తున్నాము. ఇలాంటి తీవ్రమయిన అపరాధానికి దైవ
శాసనంలో నిర్ణయమయిన ఫలితాన్నే చవిచూస్తున్నాము. ఒక

జాతి (సమాజం) దైవప్రసాదాన్ని నిరాకరించినప్పుడు, తన నిజ స్వామికి ద్రోహం తలపెట్టినప్పుడు, దైవం ఆ జాతిని ఇహ లోకంలోను, పరలోకంలోను శిక్షిస్తాడు. యూదుల విషయంలో ఈ దైవ సంప్రదాయం పూర్తిగా నెరవేరింది. ప్రస్తుతం మనం నేరస్థుల బోనులో నిలబడ్డాం యూదుల్ని శిక్షించటానికి వారిపై దైవానికి ఎలాంటి ప్రత్యేక కక్ష లేదు మనం అదే తప్పుచేసి శిక్ష నుండి తప్పించుకోవడానికి మన ఎడల దైవానికి ఎలాంటి ప్రత్యేక బంధుత్వమూ లేదు. నిజం చెప్పాలంటే మనం ఈ సత్య సాక్ష్యమిచ్చే విధి నిర్వహణలో ఏ మేరకు పొరపాటు చేస్తూ పోయామో, అసత్యానికి సాక్షులుగా నిలవడానికి ఎంత వేగంగా ముందంజవేస్తున్నామో, అదే వేగంతో మనం పతనానికి గురయ్యాము, గత ఒక శతాబ్దంలోనే మొరాకో నుండి దూరప్రాచ్యం వరకు దేశాలకు దేశాలే మన చేతి నుండి జారిపోయాయి. ముస్లిమ్ దేశాలు ఒకొక్కటిగా పరాధీనమయిపోతూ పరపాలనకు లోనవుతూ వచ్చాయి ముస్లిముల పేరు గర్వమూగౌరవాలకు సూచన అయ్యే బదులు పరాభవానికి, పరాధీనతకు సంకేతంగా తయారయింది. ప్రపంచంలో మనకు గౌరవమే మిగల్లేదు. మనల్ని నరమేధానికి గురిచేస్తున్నారు. మనల్ని ఇండ్ల నుండి తరిమివేస్తున్నారు. ఘోర హింసల పాల్జేస్తున్నారు. మనల్ని బానిసలుగా, నౌకర్లుగా సేవ చెయ్యడానికి బ్రతుకనిస్తున్నారు. ఎక్కడయితే ముస్లింల రాజ్యాలున్నాయో, అక్కడా వారు ఘోరమయిన పరాజయాన్ని చవిచూస్తున్నారు. నేడు వారు విదేశీ శక్తుల భయం వల్ల

గడగడ వణుకుతున్నారు. వారు మాటల ద్వారా చేతల ద్వారా ఇస్లాం పట్ల సాక్ష్యమిచ్చేవారుగా తయారయి ఉంటే దైవధిక్కార శక్తులు వారి భయం వల్ల గడగడలాడుతూ ఉండేవి. అంత దూరం ఎందుకు, స్వయంగా భారత దేశంలోనే మన పరిస్థితి ఎలా ఉందో చూసుకోండి. సాక్ష్యం ఇవ్వడంలో మీ వల్ల జరిగిన తప్పు వల్ల, ఇక మీరు మీ మాటల ద్వారా, చేతల ద్వారా అందజేసిన సత్యవిరుద్ధమయిన సాక్ష్యం కారణంగా ఈ దేశంలోనే మీకు అధోగతి దాపురించింది. మొదట మరాఠాల చేతులో, తరువాత శిక్కుల చేతుల్లో మీరు అణచివేయబడ్డారు. ఆపైన ఆంగ్లేయుల బానిసత్వం మీకు ప్రాప్తమయింది. ఇప్పుడయితే పూర్వపు వినాశాలకు మించిన వినాశాలు మీ ముందుకు వస్తున్నాయి. నేడు మీ ముందున్న బృహత్తర సమస్య అధిక సంఖ్యాక వర్గం (మెజారిటీ) అల్పసంఖ్యాక వర్గం (మైనారిటీ) అన్న విషయానికి సంబంధించినది. నేడు హిందూ అధిక సంఖ్యాకులు మీపై ఆధిక్యత వహిస్తారని, శూద్రుల్లా నీచ స్థితికి మిమ్మల్ని దిగజార్చుతారని మీరు భయవిహ్వలులై పోతున్నారు. కాని దైవ సాక్షిగా, మీరే చెప్పండి. మీరే గనక ఇస్లామ్ ఎడల నిజమయిన సాక్షులుగా ఇక్కడ నిలబడి ఉన్నట్లయితే నేడు మీకు లోనయి ఉన్న భయాందోళనలు మిమ్మల్ని ఆవహించి ఉండేవా? ఇప్పటికయినా మీరు మీ మాటల ద్వారా చేతల ద్వారా ప్రజల సమక్షంలో ఇస్లామ్ సాక్ష్యాన్నిచ్చేవారుగా రూపొందినట్లయితే ఈ దేశంలో మెజారిటీ, మైనారిటీ భావనలు మిమ్మల్ని వెంటాడగలుగుతాయా?

అరేబియాలో అత్యంత దురభిమానులు, క్రూరులూ అయిన అధిక సంఖ్యాకులు లక్షలో ఒక్కరుగా ఉన్న అల్ప సంఖ్యాకుల్ని ప్రపంచంలో నామరూపాల్లేకుండా చెయ్యాలని ప్రయత్నించారు, కాని ఇస్లామ్ గురించి ఇచ్చిన సాక్ష్యం పది సంవత్సరాల్లోనే ఆ అల్పసంఖ్యాకుల్ని నూరు శాతం అధిక సంఖ్యాకులుగా మార్చివేసింది. తరువాత ఈ ఇస్లామ్ సాక్షులు అరేబియా నుండి బయలు వెడలి పాతిక సంవత్సరాల్లోనే టర్కీ నుండి మొరాకో వరకు గల ప్రజల్ని తమ సత్య సాక్ష్యం ద్వారా ప్రభావితం చేశారు. దాన్ని అనుసరించేలా చేశారు. ఎక్క డయితే నూరు శాతం అగ్నిపూజారులు, విగ్రహారాధకులు, క్రైస్తవులు ఉండేవారో అక్కడ నూరు శాతం ముస్లిములు నివసిస్తూ అగుపించారు. ఎటువంటి మంకుపట్టు అయినా, ఎలాంటి జాతీయ దురభిమానమయినా, ఎలాంటి మతతత్వపు సంకుచితత్వమయినా ఈ సజీవ సత్యసాక్ష్యానికి ఎదురుగా నిలువ లేకపోయాయి. ఇప్పుడు ఒకవేళ మీరు అణచివేతకు గురవు తున్నారంటే, ఇంకా ముందు ఇంతకంటే గొప్ప వినాశనం సంభవించే ప్రమాదాన్ని ఎదురుచూస్తున్నారంటే అది కేవలం మీరు చేస్తున్న సత్యాన్ని మరుగుపరచడం, అసత్యానికి సాక్ష మివ్వడంలాంటి పనుల పర్యవసానం కాకపోతే మరేమిటి ?

ఈ శిక్ష అయితే మీరు చేసిన అపరాధానికి ప్రపంచంలో మీకు లభిస్తోంది. పరలోకంలో ఇంతకంటే తీవ్రమయిన శిక్ష ప్రాప్తమయ్యే ప్రమాదముంది. మీరు సత్యానికి సాక్షులు మీ విధిని నిర్వర్తించనంతవరకు, ప్రపంచంలో చెలరేగే మా భ్రష్టత్వం, దౌర్జన్యం, అత్యాచారం, అరాచకాలు, వ్యాపిం

నీతిబాహ్యతలు అశ్లీల చేష్టల ఎడల మీ బాధ్యతను మీరు తప్పించుకోలేరు. మీరు ఈ చెడుల్ని సృష్టించేందుకు బాధ్యులు కాకపోయినా ఇవి జనించే కారణాలను మనగలనివ్వడానికి, అవి వ్యాప్తిచెందే వీలును కల్పించడానికి మటుకు బాధ్యులు మీరే.

మహాశయులారా !

ఇప్పటివరకు నేను మనవి చేసిన దాని ప్రకారం, ముస్లిములమయినందువలన మనం చేసి ఉండవలసిందేమిటి ? మనం చేస్తున్నదేమిటి ? ఏ శాస్తిని అనుభవిస్తున్నాము ? అన్న విషయాలు తెలుసుకొనే ఉంటారు. దీని దృష్ట్యా మీరు అసలు యదార్థాన్ని పరిశీలిస్తే ఒక విషయం మటుకు మీకు దానంతట అదే స్పష్టమవుతుంది. ముస్లిములు ఈ దేశంలోను, ఇతర ప్రపంచ దేశాల్లోను ఏ సమస్యల్ని తమ అసలైన సమస్యలుగా భావించి వాటి పరిష్కారం కొరకు, కొంత తమ కాల్పనిక ఉపాయాల ద్వారా, అధికంగా ఇతరుల నుండి అరువు తెచ్చుకున్న విధానాల ద్వారా తమ శక్తిసామర్థ్యాలనన్నింటినీ ధారపోస్తున్నారో — వాస్తవానికి వాటిలో ఏదీ నారి అసలు సమస్య కాదు. వాటి పరిష్కారానికి సమయాన్ని, శక్తిని, సంపదను వెచ్చించటం కేవలం వృథాప్రయాస తప్ప మరేమీ కాదు.

ఒక అల్ప సంఖ్యాక వర్గం మరో ఆధిక్యతగల అధిక సంఖ్యాక వర్గం మధ్యన ఉంటూ తన అస్తిత్వాన్ని, ప్రయోజనాలను, హక్కుల్ని ఏ విధంగా కాపాడుకోవాలి ? ఒక అధిక

సంఖ్యాక వర్గం తన పరిధుల్లో ఉంటూ తనకు దక్కవలసిన అధికారాన్ని ఏ విధంగా హస్తగతం చేసుకోవాలి ? ఒక పాలిత జాతి, ఇంకో పాలక జాతి అధికృత నుండి ఎలా విముక్తి పొందాలి ? ఒక బలహీన జాతి మరో శక్తిమంతమయిన జాతి దౌర్జన్యాల నుండి తన్ను తాను ఎలా రక్షించుకోవాలి ? వెనుకబడ్డ జాతి, ప్రపంచంలోని ఇతర అభివృద్ధ జాతుల్లాంటి సిరి సంపదల్ని, శక్తిని ఎలా సాధించగలగాలి ? ఇవి ఇంకా ఇలాంటి అనేక సమస్యలు ఇతరులకయితే ముఖ్యమయినవి, ప్రాధాన్యతగలవి కావచ్చు. వారి సకల ప్రయత్నాలకు కేంద్రం కూడా కావచ్చు. కాని ముస్లిములైన మనకు స్వయంగా ఇవే అసలు మౌలిక సమస్యలు కావు. ఇవి, మన కర్తవ్యం పట్ల లోగడ మనం చూపిన, ఇంకా నేటికీ చూపుతూ ఉన్న ఉపేక్షాభావానికి కేవలం పర్యవసానాలే. మనం మన కర్తవ్యాన్ని నెరవేర్చివున్నట్లయితే నేడు అందోళనకరంగా తయారయిన సమస్యల కారడవి మన చుట్టూ అలుముకునేది కాదు. ఇప్పటికయినా మనం ఈ అడవిని నరికే ప్రయత్నాల్లో మన శక్తుల్ని వృధా చెయ్యడానికి బదులుగా మన అసలు కర్తవ్యం వైపు శ్రద్ధ వహిస్తే, కేవలం మనకొరకే కాదు, ప్రపంచం మొత్తానికి ఆందోళనకరంగా పరిణమించిన ఈ సమస్యల అరణ్యం తాదూరమయిపోతుంది. ఎందుకంటే ప్రపంచాన్ని పరిశుద్ధంచేసే అసలు బాధ్యత మన మీదనే ఉంది. మనం మన కర్తవ్యాన్ని విస్మరించగానే ప్రపంచం ముళ్ళ పొదలతో నిండిపోయింది. అందులో అత్యధిక భాగం మన తలపైబడింది.

అతి విచారకరమయిన విషయం ఏమంటే ముస్లిముల ధార్మిక గురువులు, రాజకీయ నాయకులు ఈ వ్యవహారాన్ని అర్థం చేసుకోడానికి ప్రయత్నించడం లేదు. ప్రతి చోటా మీ అసలు సమస్యలు, అల్ప, అధిక సంఖ్య, దేశ స్వాతంత్ర్యం, జాతి పరిరక్షణ, భౌతిక ప్రగతికి సంబంధించిన సమస్యలే అని వారిని నమ్మింపజేస్తున్నారు. ఈ సమస్యల పరిష్కారానికి కూడా వారు, తాము ఇతరుల నుండి గ్రహించిన ఉపాయాలను పద్ధతులనే ముందుంచుతున్నారు. నాకు దేవుని ఉనికి పట్ల ఎంత విశ్వాసముందో, అంతే విశ్వాసంతో మిమ్మల్ని అప మార్గం పట్టించడం జరుగుతోందని, ఆ మార్గాల ననుసరించి మీరు ఎప్పటికయినా సాఫల్య గమ్యాన్ని చేరుకోలేరని చెబుతున్నాను. మీ జీవితానికి సంబంధించిన అసలు సమస్య ఏమిటో మీతో నిర్మొహమాటంగా, స్పష్టంగా చెప్పకపోతే నేను మీ చెడును కాంక్షించేవాణ్ణే అవుతాను. నాకు తెలిసినంత మట్టుకు మీ వర్తమానం, మీ భవిష్యత్తూ రెండూ ఒకే ప్రశ్నపై ఆధారభూతమయి ఉన్నాయి. మీకు దైవం తన ప్రవక్త ద్వారా ప్రసాదించిన మార్గదర్శకత్వం పట్ల—దేని ఆధారంగా నయితే మిమ్మల్ని ముస్లిములంటారో, ఇంకా మీరు ఇష్టపడినా ఇష్టపడకపోయినా దాని ఆధారంగానే మిమ్మల్ని ఇస్లామ్ ప్రతినిధులుగా భావించడం జరుగుతుందో— దానిపట్ల ఎలాంటి వైఖరిని అవలంబిస్తారు? అన్నదే ఆ ప్రశ్న. ఒకవేళ మీరు దీన్ని సక్రమంగా అనుసరించి మీ మాటల ద్వారా, మీ చేతల ద్వారా దీని నిజసాక్ష్యమిచ్చే, మీ సామూహిక వ్యవహారాల్లో ఇస్లామ్ పరిపూర్ణంగా ప్రతిబింబిస్తే మీరు ఇహలోకంలో ఔన్నత్యాన్ని, పరలోకంలో సాఫల్యాన్ని పొందగలరు. మీపై

నేడు ఆవరించి ఉన్న భయం, దుఃఖం, పతనం, దౌర్భాగ్యం, ఇంకా పరాధీనత, పరిపాలనా కారుమేఘాలు కొన్ని సంవత్స రాల్లోనే మటుమాయమయిపోగలవు. మీరు అందజేసే సత్య సందేశం, మీ అచరణలోని ఋజువర్తనం హృదయాలను లోబరచుకుంటుంది. ప్రపంచంలో మీ పరపతి పెరగుతుంది. న్యాయాన్ని మీద్వారా ఆశిస్తారు. విశ్వసనీయత నిజాయితీ అంటే మీ వైపుకు చూస్తారు. ప్రామాణికత ఏదైనా ఉంటే మీ మాట నుదహరిస్తారు. మంచి అన్నది మీ ద్వారానే ప్రాప్తిస్తుందన్న ఆశలుజనిస్తాయి. దైవధిక్కారాగ్రేసరుల పలుకుబడి మీ సమక్షంలో విలువలేకుండా పోతుంది. వారి తత్వాలు, రాజకీయ, ఆర్థిక సిద్ధాంతాలు సర్వం మీ సత్యత, నిజాయితీ ముందు బూట కాలుగా తేలిపోతాయి. వారి శిబిరాల్లో మోహరిస్తున్న శక్తులన్నీ ఒక్కొక్కటిగా అటునుండి తెగతెంపులు చేసుకుని ఇస్లామ్ శిబిరాల్లో చేరిపోతాయి. చివరికి కమ్యూనిజం మాస్కోలో నిలువ నీడ కోల్పోతుంది. పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యం స్వయంగా వాషింగ్టన్, న్యూయార్కుల్లో తలదాచుకోడానికి నానా యాతనలు పడుతుంది. భౌతికతా ప్రధానమయిన నాస్తికత్వం లండన్ మరియు పారిస్ యూనివర్శిటీల్లో స్థానాన్ని కోల్పో తుంది. జాతి తత్వానికి స్వయంగా బ్రాహ్మణుల్లోనూ, జర్మన్ల లోనూ అనుయాయులు కరువయిపోతారు. నేటి యుగం కూడా చరిత్ర పుటల్లో కేవలం గుణపాఠం గరిపే గాధగా మాత్రం మిగులుతుంది — ఇందులో ఇస్లామ్‌లాంటి విశ్వజనీనమయిన, విజయదాయకమయిన శక్తిని కలిగి ఉన్న ముస్లిములు ఒకా నొకప్పుడు మూసా (అస్సలాం) ఊతకర్ర చంకన ఉంచుకుని

కర్త ముక్కల్ని, తాత్రి తునకల్ని చూచి పణుకుకు లోనయ్యా రని !

ఈ భవిష్యత్తు మీకు ప్రాప్తం కావాల టే మీరు ఇస్లాంను త్రికరణ శుద్ధితో అనుసరించేవారుగా దానికి నిజమైన సాక్షులుగా నిలువగలగాలి. దీనికి భిన్నంగా మీ వైఖరి మరోలా ఉన్నట్లయితే పర్యవసానాలను ఎదుర్కొనవలసి ఉంటుంది. దైవం పంపిన మార్గదర్శకత్వంపై ధన సర్పంలా తిష్టవేసిన వారిలా ఉంటే, స్వయంగా మీరూ దాని ద్వారా ప్రయోజనం పొందక, ఇతరులకూ దాని లాభాలు ఒనగూడే అవకాశం కల్పించకపోతే, మిమ్మల్ని మీరు ముస్లింలుగా ప్రకటించుకుని, ఇస్లామ్ ప్రతినిధులు అనిపించుకుంటూ ఉండి మొత్తానికి తమ మాటలూ, చేతల ద్వారా సాక్ష్యమేమో మూఢత్వం, బహు దైవారాధన, ప్రాపంచిక ప్రియత్వం, నైతిక విశృంఖలత్వం ఇత్యాది వాటికి ఇస్తున్నారు. దైవ గ్రంథం మీ ఇండ్లలో అటకపై పెట్టారు. కాని మార్గదర్శకత్వం కొరకు తిరస్కారా గ్రేసరుల్ని, మార్గభ్రష్టతకూపాలను ఆశ్రయిస్తున్నారు. దైవ దాస్యం చేస్తున్న వాదనే కాని ప్రతి షైతాను, ప్రతి దైవధిక్కార శక్తికి దాస్యం చేస్తున్నారు. మీరు చేసే స్నేహమయినా, శత్రుత్వమయినా కేవలం మీ మనోకాంక్షల కొరకే అయినా ఈ విషయంలోనూ మీరు ఇస్లాంనే బలి పశువు చేస్తున్నారు. ఈ విధంగా కూడా మీరు మీ జీవితాల్లో ఇస్లామ్ శుభాలకు దూర మవుతున్నారు. దాని మూలంగా ప్రపంచాన్ని ఈ శుభాల వైపుకు ఆహ్వానించడం అలా ఉంచి వాటికి దూరంగా వైదొల గేలా చేస్తున్నారు. ఈ పరిస్థితిలో మీ ఇహమూ బాగుపడదు,

పరమూ ఫలవంతమవదు. దాని ఫలితం దైవనియమానుసారం మీరు నేడు అనుభవిస్తూ కూడా ఉన్నారు. రేపటి మీ స్థితి నేటికంటే అధ్వాన్నంగా ఉంటుందన్నా అందులో ఆశ్చర్యపడ వలసిన అవసరం లేదు. ఇస్లామ్ లేబిల్‌ని తీసివేసి విచ్చల విడిగా ధర్మ తిరస్కార వైఖరయినా అవలంబిస్తే కనీసం మీ ప్రపంచమయినా అమెరికా, రష్యా, బ్రిటన్‌లా రూపుదిద్దు కుంటుంది కాని ముస్లిమ్‌గా ఉంటూ మీరు ముస్లిమేతరు లుగా వ్యవహరించడం, దైవధర్మానికి బూటకపు ప్రాతినిధ్యం వహించడం తద్వారా ప్రపంచం సన్మార్గాన్ని అనుసరించకుండా అవరోధంగా తయారవడం మహాపరాధం. ఈ అపరాధం మిమ్మల్ని ఈ ప్రపంచంలోనూ సుఖంగా జీవించనివ్వదు. ఈ నేరానికి పడే శిక్ష దివ్య ఖుర్‌ఆన్‌లో ఏదయితే సూచింపబడిందో దానికి సజీవ నిదర్శనంగా ఈ రోజు కూడా యూదులు మీ ముందు ఉన్నారు: దాన్ని మీరూ తప్పించుకోలేరు. దీన్నుండి తప్పించుకోడానికి ఐక్యజాతీయతను "చిన్న చెడు"గా వ్యవహ రించినా లేక ప్రత్యేక జాతీయతను ఒప్పించి ముస్లిమ్ జాతిగా లభించగలదాన్నంతా పొందినా అది సాధ్యపడదు. దాన్నుండి తప్పించుకోవాలంటే ఒకటే దారి. ఈ అపరాధాన్ని మాన కోవాలి.



మేము ఏ ఉద్దేశ్యంతో బయల్దేరామో ఇప్పుడు క్లుప్తంగ చెబుతాను. ఇస్లామ్‌ను తమ ధర్మం అని ఒప్పుకునేవారినందరినీ వారు ఈ ధర్మాన్ని యదార్థంగానే తమ ధర్మంగా చేసుకోవాలని మేము పిలుస్తున్నాము. వ్యక్తిగతంగా తమ జీవితాల్లోను, సామూహికంగా తమ ఇండ్లల్లో, తమ కుటుంబాల్లో, తమ సమా

జంలో, తమ విద్యాలయాల్లో, తమ సాహిత్యంలో, తమ పత్రికా రచనల్లో, తమ వ్యాపార వాణిజ్యాల్లో, తమ ఆర్థిక వ్యవహారాల్లో, తమ సంస్థలూ జాతీయ వ్యవస్థాపనల్లో, తమ జాతీయ పాలసీలో—ప్రతి చోటా క్రియారూపంలో దాన్ని నెల కొలపాలని. తమ మాటల ద్వారా, చేతల ద్వారా ప్రపంచం ముందు దానిపట్ల నిజసాక్ష్యాన్ని ఇవ్వాలని సందేశమిస్తున్నాము. ఇంకా ముస్లిములయినందున ధర్మసంస్థాపనం, సత్యానికి సాక్షులుగా నిలవడం మీ జీవిత పరమార్థమని మేము వీరితో అంటాము. మేము చెప్పేదేమంటే, ఈ కారణంచేత మీరు చేసే ప్రతి ప్రయత్నానికి, కృషికి కేంద్ర బిందువు ఇదొక్కటే కావాలి. దీనికి భిన్నమయనదాన్ని, ఇస్లామ్‌ను తప్పుగా ప్రతిబింబింపజేసేదాన్ని—ఏ విషయాన్నయినా సరే పూర్తిగా వదలి వెయ్యాలి. మీరు చెప్పేదాన్ని, చేసేదాన్ని, మీ వైఖరిని ఇస్లామ్ రీత్యా పునఃపరిశీలించండి. ఈ ధర్మసంస్థాపనం పరిపూర్ణమవడానికగ్గాను మీ సకల ప్రయత్నాలను ఏకోన్ముఖం చెయ్యాలి. ధర్మానికి సాక్ష్యం సరిగ్గా నెరవేరేలా, ప్రపంచం సమక్షంలో వాదన పరిపూర్ణమయ్యేలా దాని సందేశం అందచెయ్యాలి.

ఇదే జమాఅతె ఇస్లామీ స్థాపనలోని అసలు ధ్యేయం. ఈ ధ్యేయసాధన కోసం మేమవలంబించిన పద్ధతి ఏమిటంటే ప్రథమంలో మేము ముస్లిములకు వారి విధిని బాధ్యతను గుర్తు చేస్తాము. వారికి ఇస్లామ్ అంటే ఏమిటి ? అది కోరేదేమిటి? ముస్లిమ్ అవడం అంటే ఏమిటి ? ముస్లిమ్ అనగానే మనిషిపై

తారసిల్లే బాధ్యతలు ఏమిటి ? అన్న విషయాలు స్పష్టంగా తెలియజేస్తాము.

ఈ విషయాన్ని అర్థం చేసుకున్నవారికి, ఇస్లామ్ విధించే బాధ్యతలన్నింటినీ వ్యక్తిగత స్థాయిలో పూర్తిచెయ్యడం సాధ్యం కాదని దీనికోసం సామూహిక కృషి అవసరం అని తెలుపుతాము. ధర్మంలో వ్యక్తిగత జీవితానికి సంబంధించిన భాగం చాలా స్వల్పమయినది. దాన్ని మీరు స్థాపించుకున్నా సంపూర్ణ ధర్మ సంస్థాపనమూ జరుగదు మరియు దాని సాక్ష్యము నెరవేరదు. వాస్తవానికి సామూహిక జీవితంపై అధర్మ వ్యవస్థ తిష్ఠవేసి ఉన్నప్పుడు స్వయంగా వ్యక్తిగత జీవితపు అనేక రంగాల్లోనూ ధర్మస్థాపనం జరగదు. సామూహిక వ్యవస్థ పట్టు రోజుకు రోజు వ్యక్తిగత పరిధిలోనూ ఇస్లామ్ పరిమితుల్ని మరింత కుంచించుకుపోయేలా చేస్తూంది. కాబట్టి పరిపూర్ణ ధర్మ సంస్థాపనకై, దాని నిజ సాక్ష్యాన్నివ్వడానికి, ముస్లిములయినందువల్ల తారసిల్లే బాధ్యతల పట్ల చైతన్యవంతులు, వాటిని నెలవేర్చే సంకల్పంగలవారు అందరూ ఏకమయి, సంఘటిత రూపంలో ధర్మాన్ని ఆచరణాత్మకంగా స్థాపించి, ప్రపంచానికి ఈ ధర్మం వైపుకు ఆహ్వానించే ప్రయత్నం చేయటం. ధర్మసంస్థాపనా మార్గంలోను, ధర్మ సందేశం మార్గంలోను ఎదురయ్యే అవాంతరాలన్నింటినీ తొలగించేందుకు కృషిచెయ్యటం అనివార్యం. ఈ కారణంగానే ధర్మంలో 'జమాఅత్' (సంఘటితంగా ఉండటం) తప్పనిసరిగా నిర్ణయించటం జరిగింది. ధర్మసంస్థాపన మరియు ధర్మ సందేశ కృషి జరిపే విషయంలో క్రమం ఈ విధంగా నిర్ణయమయింది. మొదట జమాత్‌ను సంఘటితం చేయాలి.

ఆ తర్వాత దైవ మార్గంలో ప్రయత్నం చేయాలి ఈ కారణం చేతనే జమాత్ లేకుండా గడిపే జీవితాన్ని అజ్ఞాన (ఇస్లామేతర) జీవితం అని మరియు జమాత్ నుండి వేరయి జీవించటాన్ని. ఇస్లామ్ నుండి వేరయి జీవించటంతో సమానమని పరిగణించ డం జరిగింది.*

ఈ విషయాన్ని అర్థం చేసుకుని, దీనిద్వారా ఎవరిలోనైతే ముస్లిములయినందున ఏర్పడిన బాధ్యతాభావం పటిష్టమవు తుందో మరెవరయితే తమ ధర్మం కొరకు తమ వ్యక్తిగత స్థాయిని, అహంభావాన్ని త్యజించి, జమాత్ క్రమబద్ధతను స్వీకరిస్తారో అలాంటి వారితో మేము చెప్పేదేమంటే, మీ ముందు మూడు మార్గాలున్నాయి. వాటిలో మీకు ఇష్టమైన దాన్ని ఎన్నుకునే స్వేచ్ఛ మీకుంది, మా సందేశం, మా మౌలిక విశ్వాసం, మా ధ్యేయం, మా సంస్థాగత వ్యవస్థ, మా పనిచేసే తీరు అన్నీ స్వచ్ఛంగా ఇస్లాంకనుగుణంగా ఉన్నాయనీ,

---

* ఇక్కడ దిగువ హదీసును ఆధారంగా తీసుకోవడం జరిగింది : అందులో మహాప్రవక్త (సఅసం) ప్రబోధించారు:

**"నేను మీకు అయిదు విషయాలు ఆదేశిస్తున్నాను. వాటివి నాకు అల్లాహ్ ఆదేశించాడు. జమాఅత్, (మాట) వినడం, విధేయత పాటించడం, హిజ్రత్ (దైవ మార్గంలో వలస), దైవ మార్గంలో జిహాద్ (నిరంతర పోరాటం). ఒక వ్యక్తి జమాఅత్ నుండి జానెడు దూరమయినా అతను ఇస్లాం బంధాన్ని తన మెడ నుండి తీసిపారేశా డన్నమాట —అతను జమాఅత్ వైపుకు మరలివస్తే తప్ప. ఎవరయితే అజ్ఞానం (విచ్ఛిన్నత) వైపుకు ఆహ్వానిస్తారో అతను నరకవాసి."**

ఖుర్ అన్, హదీసుల వెలుగులో ముస్లిమ్ సమాజం చెయ్యా వలసిన అసలు పనినే మేము చేస్తున్నామని మీ అంతర్యం ఒప్పుకుంటే మీరు మాకు తోడుగా రండి. ఒకవేళ ఏ కారణం చేతనయినా మీకు మాపై నమ్మకం కుదరకపోతే, మరే ఇతర సంస్థ అయినా స్వచ్ఛమయిన ఇస్లామీయ ధ్యేయంకై ఇస్లామీయ విధానంలో పనిచేస్తూ కనిపిస్తే అందులో చేరిపోండి. మేము కూడా అలాంటి సంస్థ ఏదయినా కానవస్తే అందులో చేరిపోయ్యే వాళ్ళమే. మాదంటూ వేరుగా ఓ జమాత్ స్థాపించాలన్న కేవలం కుతూహలం మాకూ లేదు, మీకు మాపైనా నమ్మకం లేక, ఇంకా ఏ ఇతర సంస్థపైనా నమ్మకం లేకపోయినట్లయితే ఈ ఇస్లామీయ విధిని నెరవేర్చటానికి స్వయంగా మీరే నిల

---

ప్రవక్త సహచరులు (రజిఅన్) అడిగారు, "దైవ ప్రవక్తా! ఆ వ్యక్తి రోజా వ్రతాన్ని పాటించినా, నమాజ్ చేసినా వరకవాపి అవుతాడా?" అని. దానికి ఆయన, "అవును అతను నమాజ్ చేసినా రోజా పాటించినా, ముస్లిమునని వాదించినా సరే" అని బదులిచ్చారు.

ఈ హదీసు ద్వారా మూడు విషయాలు ద్యోతకమవుతున్నాయి.

1. ధర్మకార్యం చెయ్యడానికి ప్రమానుగతి ప్రకారం తొలుత జమాఅత్ ఏర్పడాలి. అది సుసంఘటితమయి అందులో అందరూ ఒక్కరి మాటనే విని అతని విధేయత పాటించే పరిస్థితి నెలకొనాలి. ఆ తరువాత పరిస్థితుల్ని బట్టి హిజ్రత్, జిహాద్ చెయ్యడమన్నది జరగాలి.

2, జమాఅత్‌కు దూరంగా ఉండటం ఇస్లాంకు దూరంగా ఉండటంతో సమానం, అంటే, మనిషి, ఇస్లాంకు పూర్వం అరబ్బులు

బడాలి. ఇస్లామీయ రీతిలో పరిపూర్ణ ధర్మ సంస్థాపనా ధ్యేయంతో, వాక్కర్మల ద్వారా దాని సాక్ష్యమిచ్చే లక్ష్యంతో ఒక జమాత్ (సంస్థ)ను మీరే నెలకొలపాలి. ఈ మూడు మార్గాల్లో మీరు ఏ మార్గాన్ని అనుసరించినా, ఇన్షాఅల్లాహ్ సత్యం మీ పక్షాన ఉంటుంది. మా జమాఅత్ ఒక్కటే సత్యంపై ఆధారభూతమయినదని, మా జమాఅత్‌లో లేనివాడు అసత్యాన్ని ఆశ్రయించాడని మేము ఎప్పుడూ వాదించలేదు. బుద్ధివివేకాలు సవ్యంగా ఉన్నంతకాలం మేము ఇలాంటి వాదన చెయ్యనూలేము. మేమెప్పుడు ప్రజల్ని మా జమాఅత్ వైపుకు పిలువలేదు. మా పిలుపు కేవలం ముస్లిములయినందున మాపై, మీపై, మనందరిపై సమానంగా విధించబడిన ఆ విధి వైపుకే. ఒకవేళ మీరు దాన్ని నిర్వహిస్తూ ఉంటే సత్యం మీ పక్షాన ఉంది — మీరు మాతో కలసి పని చేసినా చేయకపోయినా సరే. కాని మీరూ ఆ పని చేయక, చేసేవారితోనూ సహకరించక, రకరకాల సాకులు వెదుకుతూ ధర్మ సంస్థాపన, మానవుల

---

అజ్ఞాన కాలంలో ఏ పరిస్థితిలోనుండేవారో అందులోకి వెళుతున్నా డన్నమాట. ఆనాడు ఎవరూ ఎవరి మాటనూ ఖాతరు చేసేవారు కాదు.

3. ఇస్లాం సూచించే అవసరాలు, దాని అసలు లక్ష్యాలు సంస్థ, సామూహిక కృషి వల్లనే నెరవేరుతాయి. అందువల్ల ప్రవక్త మహనీయులు (సఅసం) జమాఅత్ నుండి దూరమయ్యేవాణ్ణి, అతని నమాజ్, రోజాలు, ముస్లిమయ్యే వాదనను కూడా ఖాతరు చెయ్యకుండా అతను ఇస్లాం నుండి దూరమయిన వ్యక్తిగా ప్రకటించారు. ఈ విషయాన్నే హజ్రత్ ఉమర్ (రజి) ఈ విధంగా వివరించారు. "జమాఅత్ లేకుండా ఇస్లాం లేదు."

సమక్షంలో సాక్ష్యం ఇచ్చే విధి నిర్వహణను తప్పించుకోవడం ఏ విధంగాను సబబు కాదు. లేక మీ సకల శక్తులు ధర్మానికి బదులు మరేదో వ్యవస్థ నిర్మాణానికి, ఇస్లామ్‌కు బదులు ఇంకా దేనికో మీ వాక్కర్మల ద్వారా సాక్ష్యం లభించడం అంతకన్నా దురదృష్టకరం. అసలు విషయం ఈ ప్రపంచం, ఈ ప్రపంచ ప్రజలతో సరిపోతే సాకులతో వెళ్ళబుచ్చవచ్చు. కాని వ్యవహారం, మన అంతర్యంలోని అంతర్యాన్నీ గ్రహించ గల జ్ఞాన సంపన్నునితో చెయ్యవలసి ఉంది. ఆయన్ని ఎలాంటి ఎత్తుగడతోనూ వంచించలేము.

ఒకే లక్ష్యసాధన కోసం వేరు వేరు సంస్థలు ఏర్పడటం అనేది స్థూలంగా చూస్తే తప్పుగానే తెలుస్తుంది. దీనివల్ల శక్తులు చిందువందు అయ్యే ప్రమాదమూ ఉంది. కాని ఇస్లామీయ వ్యవస్థ ఛిన్నాభిన్నమయినప్పుడు, ఇప్పుడు ప్రశ్న ఆ వ్యవస్థను నడిపించడం గురించి కాకుండా ఈ వ్యవస్థను కొత్తగా నెలకొలిపే విషయంలో ఎదురయినప్పుడు ప్రారంభం లోనే ముస్లిమ్ సమాజం యావత్తు ఏకమయి ఏర్పడే ఆ "అల్ జమాఅత్" ఉనికిలోకి రావడం సాధ్యపడదు. అలాంటి "అల్ జమాఅత్"లో చేరడం ప్రతి ముస్లిమ్ వ్యక్తికి అనివార్యమయ్యే పరిస్థితి నెలకొనడం, అందులో చేరని వ్యక్తి బ్రతుకు అజ్ఞానపు జీవితానికి, దానితో వేరుపడటం ధర్మ విసర్జనతో సమాన మవడం అన్నది నేడు జరగలేని పని. ప్రారంభంలో వేర్వేరు చోట్ల వేర్వేరు సంస్థలు ఈ లక్ష్యం కొరకు ఏర్పడి తమ వంతు పాత్ర నిర్వహిస్తూ ఉండడం తప్ప గత్యంతరం లేదు. ఈ సంస్థల మధ్య అహంభావాలు, అతివాదాలు నెలకొనకుండా

చిత్తశుద్ధితో నిజమయిన ఇస్లామీయ లక్ష్యసాధనకు ఇవన్నీ ఇస్లామీయ పద్ధతులతో పాటుపడేవే అయితే చివరికి అవన్నీ ఏకమై పోగలవు. సత్యమార్గంపై నడిచేవారు ఎక్కువ కాలం దూరంగా మనలేరు, సత్యం వారిని తప్పక ఏకం చేస్తుంది. ఎందుకంటే సత్యం స్వభావంలోనే సంఘటితపర్చటం, ప్రేమను ఏర్పరచడం, ఏకంచెయ్యడం, సమైక్యపరచడం కలిసివున్నాయి. విభేదాలు పొడసూపేది సత్యంతోపాటు అసత్యం కూడా కొంత మిళితమయినప్పుడే లేక బయటికి సత్యం ప్రదర్శన జరిగినా అంతర్యంలో అసత్యం తిష్ట వేసి ఉన్నప్పుడే.

ఇక మా జమాఅత్‌ను ఇష్టపడి ఇందులో ప్రవేశించే వారిని మేం కోరేదేమిటో, వారికై మావద్ద ఉన్న కార్యక్రమం ఏమిటో క్లుప్తంగా వివరిస్తాను. ఇస్లామ్ ప్రతి ముస్లిమ్‌ని కోరే దేమిటో అంతకంటే ఎక్కువగా మేము మా కార్యకర్తలను కోరడం లేదు. మేము ఇస్లాం చేసే ఏ డిమాండులో ఏ మాత్రం హెచ్చించటంగాని, ఏ మాత్రం తగ్గించటంగాని చేయబోవడం లేదు. మేము ప్రతి వ్యక్తి ఎదుట ఇస్లామ్‌ను పూర్తిగా ఎలాంటి హెచ్చుతగ్గులేకుండా సమర్పిస్తాము. అతనితో ఈ ధర్మాన్ని పూర్తి అవగాహనతో, సచేతనంగా స్వీకరించమని, ఇది కోరే ప్రతి విషయాన్ని అర్థం చేసుకుని నెరవేర్చమని, ధర్మవిధులకు దాని మూల భావానికి విరుద్ధమయిన విషయాలన్నింటినీ — మీ చేతలను, మీ భావాలు, మీ మాటలు — పరిశుద్ధం చెయ్యమని మీ జీవితం మొత్తాన ఇస్లామ్ సాక్ష్యాన్ని ప్రకటించమని మేము చెబుతాము. ఇదే మా సంస్థలో సభ్యత్వ రుసుము. ఇవే మా సభ్యత్వ నియమాలు. మా నిబంధనావళి, మా సంస్థా

గత వ్యవస్థ, మా సందేశం అంతా బట్టబయలుగానే ఉన్నాయి. దీన్ని పరిశీలించి ఏ వ్యక్తి అయినా తెలుసుకోగలడు— మేము అసలు ఇస్లామ్‌లో— ఖుర్ఆన్ మరియు ప్రవక్త (సఅసం) సున్నత్‌పై ఆధారపడిన ఇస్లామ్‌లో— ఎలాంటి హెచ్చుతగ్గులు చెయ్యలేదని. ఏ విషయమయినా ఖుర్ఆన్ మరియు సున్నత్ ప్రబోధాలకన్నా అధికంగా చేర్చబడిందని ఎవరయినా నిరూపిస్తే మేము దాన్ని తొలగించటానికి ఎల్లప్పుడూ సిద్ధమే. అదే విధంగా ఒక విషయం ఖుర్ఆన్ మరియు సున్నత్‌లో ఉండగా మావద్ద లేదని ఎవరయినా తెలియపరిస్తే ఎలాంటి సంకోచం లేకుండా మేము దాన్ని స్వీకరిస్తాము. ఎందుకంటే మేము బయల్దేరిందే ధర్మాన్ని ఎలాంటి హెచ్చుతగ్గులేకుండా స్థాపించడానికి, దాని సాక్ష్యమివ్వడానికి. అలాంటప్పుడు మా ఈ లక్ష్యంలోనే మేము ద్వంద్వ స్వభావం కనబరిస్తే మాకంటే దుర్మార్గుడు ఎవడు కాగలడు ?

ఈ విధంగా మా జమాఅత్‌లో చేరే వారికై మావద్ద ఉన్న ఒకే పని— తమ మాటల ద్వారా, చేతల ద్వారా ఇస్లామ్ ఎడల సాక్ష్యం ఇవ్వడం ధర్మ వ్యవస్థను పరిపూర్ణంగా స్థాపించటానికి సామూహిక కృషి సలపడం మాత్రమే. తద్వారా ప్రజల సమక్షంలో సాక్ష్యం ఇచ్చే బాధ్యత నెరవేరుతుంది. నోటి సాక్ష్యానికి సంబంధించినంతవరకు మేము, మా కార్యకర్తలు తమ తమ శక్తిసామర్థ్యాలకనుగుణంగా నోటి ద్వారా, కలం ద్వారా ఇస్లామ్‌ను ఇతోధికంగా సమంజసమయిన రీతిలో, ప్రజల బుద్ధికందే విధంగా బోధపరచడానికి కృషిచేసే తర్ఫీదు

పొందుతున్నారు ఇంకా సాహిత్యం శాస్త్రాలకు సంబంధించిన క్షేత్రంలోను సకల జీవన వ్యవహారాల విషయంలో ఇస్లామీయ బోధనల సత్యతను ప్రజల సమక్షంలో విశదపరిచేందుకు సంఘటితంగా పనిచేసే సంస్థల్ని కూడా స్థాపించటానికి కృషి చేస్తున్నాము. ఈ లక్ష్యసాధనకు ప్రచార ప్రసారాల సకల సాధనాలను వినియోగించడం జరుగుతుంది. ఇక క్రియారూపంలో ఇచ్చే సాక్ష్యానికై మా ప్రయత్నం ఏమంటే మొదట ప్రతి వ్యక్తి ఇస్లామ్ ఎడల సజీవ సాక్ష్యంగా మారిపోవాలి. ఆ తరువాత అలాంటి వ్యక్తుల ద్వారా, ఒక సంఘటితమయిన సమాజం రూపొంది అందులో ఇస్లామ్ తన అసలైన రూపంలో కానరాగలగాలి. చివరకు ఈ సమాజం తన కృషి ద్వారా అసత్య వాదపు వ్యవస్థ ఆధిక్యతను అంతం చేసి ప్రపంచంలో ఇస్లామ్‌ను పరిపూర్ణంగా ప్రతిబింబింపజేసే సత్య ప్రధానమయిన వ్యవస్థను నెలకొల్పాలి.

మహాశయులారా !

ఇదే మా లక్ష్యం మరియు ఇదే మా ప్రోగ్రాం. ఈ విషయంలో ముస్లిములకు కూడా ఏదయినా ఆక్షేపణ కాగలదని మేమనుకోలేదు. కాని ఏ రోజునయితే మేము ఈ మార్గాన అడుగుపెట్టామో ఆ రోజు నుండే ఎడతెగని ఆక్షేపణలు వెల్లువలా వచ్చిపడుతున్నాయి. ఈ ఆక్షేపణలన్నీ గమనార్హమయినవి కావు. ఒకేసారి వీటన్నిటినీ పరిశీలించడం సాధ్యమూ కాదు. కాని ఈ సందర్భంలో అపార్థాలను సృష్టించే కొన్ని ఆక్షేపణలను గురించి కొంత చెప్పాలనుకుంటున్నాను.

ఒకటి, మీ జమాఅత్ ఇస్లామ్‌లో ఒక కొత్త వర్గాన్ని సృష్టించిందని చెబుతున్నారు. ఇలా చెప్పేవారికి బహుశా వర్గం ఏర్పడటానికిగల కారణాలేమిటో అసలు తెలీదులాగుంది. ధర్మంలో ఏ విషయాల మూలంగా విభేదాలు జనిస్తాయో వాటిని సంగ్రహంగా పరిశీలిస్తే అవి నాలుగు రకాలుగా విదితమవుతాయి. ఒకటి, అసలు ధర్మంలోనే, ధర్మంలో లేనటువంటి ఒక విషయాన్ని పెంచడం. ఇంకా అలా పెంచిన విషయాన్నే విశ్వాసం అవిశ్వాసాల్లో, ఋజుమార్గం, మార్గభ్రష్టత్వాల్లో విభేదానికి ఆధారంగా పరిగణించడం. రెండవది, ధర్మంలోని ఏదయినా ప్రత్యేక సమస్యను తీసికొని దానికి ఖుర్ఆన్ మరియు సున్నత్‌లో లేనటువంటి ప్రాముఖ్యతను అంటగట్టటం, ఆ విషయం ఆధారంగానే వర్గాలుగా విడిపోవడం. మూడవది, షరీఅత్ మూలాధారాల ద్వారా అనువర్తన, పరిగ్రహణకు సంబంధించిన విషయాలలో అతిశయానికి పోయి, వాటిపట్ల తమ విధానం (మస్లక్) తప్ప ఇతర విధానాల వారిని అపరాధులుగా, మార్గభ్రష్టులుగా, హీనమయినవారుగా ఇంకా విశ్వాసహీనులుగా పరిగణించడం లేదా కనీసం వారి యెడల వివక్షత కనబరచడం. నాల్గవది, ప్రవక్త తప్ప ఇతర ప్రత్యేక వ్యక్తి విషయంలో అతిశయవైఖరి అవలంబించి, అతనికి ప్రత్యేక స్థానం కల్పించి దాన్ని అంగీకరించడమే విశ్వాసం, అవిశ్వాసాల గీటురాయిగా పరిగణించడం లేదా ఒక జమాఅత్ (సంస్థ) అందులో చేరినవారే సత్యాన్ని అనుసరించేవారని కడమ ముస్లిములందరూ అసత్యవాదులని వాదించడం. మేము ఈ నాల్గింటిలో ఏ తప్పును చేశామో తెలుసుకోదలుస్తున్నాను. ఎవరయినా మేము ఫలానా రకపు తప్పు చేశామని సాధారణంగా

నిరూపిస్తే మేము వెంటనే పశ్చాత్తాపపడి మమ్మల్ని మేము సంస్కరించుకోవడానికి ఎంత మాత్రము వెనుకాడము. ఎందుకంటే మేము లేచింది దైవ ధర్మ సంస్థాపనార్థం – ధర్మంలో చీలికలు లేవదీయటానికి కాదు. కాని మేము ఇలాంటి ఏ తప్పు చేయలేకపోతే మా ఉద్యమం వల్ల ఒక కొత్త వర్గం పుట్టే ప్రమాదముందని ఎలా చెప్పగలరు ?

మేము కేవలం ఇస్లాంను, ఎలాంటి హెచ్చుతగ్గుల్లేనటువంటి ఇస్లామ్‌ను అందజేస్తున్నాము. ముస్లింలను కేవలం, రండి మనమంతా కలసి ఈ ధర్మాన్ని క్రియారూపంలో స్థాపించి ప్రపంచం సమక్షంలో దీని సాక్ష్యమిద్దామని మాత్రమే మేము పిలుపునిస్తున్నాము.

మా సామూహిక వ్యవస్థకు పునాదిగా మొత్తం ధర్మాన్ని నిర్ణయించాము– దాని ఏదో ఒక విభాగానికి లేక కొన్ని విభాగాలకు మాత్రమే కాదు. షరీఅత్ మూలాధారాల ద్వారా అనువర్తనకు సంబంధించిన విషయాల్లో మేము అన్ని విధానాలను అవి షరీఅత్ నియమాల పరిధుల్లో అనుమతించబడినంతమేరకు సరిఅయినవిగానే పరిగణిస్తాము. సదరు విధానాల్లో ఎవరికి ఏ విధానం సంతృప్తికరంగా తోస్తే దాన్ని అవలంబించే హక్కు ప్రతి ఒక్కరికి ఉందని మేము అంగీకరిస్తాము. ఇలాంటి అనువర్తనా విధానంలో ఏదో ఒక్కదాని ఆధారంగా చీలికను మేము ధర్మబద్ధమయినదిగా భావించము.

మా ఈ జమాఅత్ విషయంలోనూ మేము ఎప్పుడూ అతిశయానికి గురికాలేదు. మా జమాఅత్‌లోనే సత్యం పూర్తిగా

కేంద్రీకృతమయి ఉందని మేమెన్నడూ చెప్పలేదు. మేము మా కర్తవ్యాన్ని గుర్తించాము, లేచి నిలబడ్డాము, మీకూ మీ కర్తవ్యాన్ని గుర్తుచేస్తున్నాము. ఇక మీరు మా వెంట వస్తారో లేక మీ కర్తవ్యాన్ని నిర్వహించడానికి స్వయంగానే కృషిచేస్తారో లేక మరెవరయినా ఈ కర్తవ్య నిర్వహణలో నిమగ్నులయి అగుపడితే వారితో కలసి కృషిచేస్తారో ఇదంతా మీ ఇష్టం.

ఇమారత్ (నాయకత్వం) విషయంలోనూ మేమెలాంటి అపోహకు గురి కాలేదు. ఈ ఉద్యమం ఏ వ్యక్తి ఆధారంగానూ ప్రారంభం కాలేదు. ఒకరికి ప్రత్యేక ధార్మిక హోదా కట్టబెట్టి, అతని మహిమల్ని మహాత్యాలను, పవిత్రతను, అతని దైవిక ప్రేరణల్ని చిలువలు పలువలుగా కథలల్లి, అతని వ్యక్తిత్వం పట్ల ప్రత్యేక శ్రద్ధాభక్తులు జనింపజేసి అతని చుట్టూ ఈ జమాఅత్ కట్టడాన్ని నిర్మించడం, ఆ వ్యక్తి వైపుకే అందరినీ పిలువడం జరగలేదు. పెద్ద పెద్ద ఉద్ఘోషణలు, స్వాప్నిక ప్రేరణలు, మహిమలు, అద్భుతాలు, వ్యక్తిగత పవిత్రతల ప్రస్తావనల రొంపి మా ఉద్యమంలో లేదు. మా పిలుపు ఏ ఒక వ్యక్తి లేక వ్యక్తుల వైపుకు కాదు, ఖుర్ఆన్ ప్రకారం ప్రతి ముస్లిం యొక్క జీవిత పరమార్థం ఏదయితే నిర్ణయమయిందో దాని వైపుకు, ఇంకా ఇస్లాం సూచించే సూత్రాల వైపుకే ఎవరైతే ఈ ధ్యేయ సాధనకై, ఆ సూత్రాల ప్రకారం మాతో కలిసి పని చేయదలుచుకుంటారో వారందరూ సమాన స్థాయిలో మా జమాఅత్‌లో సభ్యులవుతారు. ఈ సభ్యులందరూ కలసి తమ కోసం ఒక నాయకుణ్ణి (అమీర్‌ని) ఎన్నుకుంటారు. ఈ నాయకత్వం అనేది అతని స్వంత హక్కు అయినందువల్ల కాదు. సంగతి

తంగా పనిచెయ్యడానికి నాయకుడంటూ ఒకడు అవసరం గనక. ఎన్నుకున్న ఈ నాయకుణ్ణి (అమీర్‌ని) బర్తరఫ్ చెయ్యవచ్చు, ఆయన స్థానంలో జమాఅత్‌లో నుండి మరో వ్యక్తిని అమీర్‌గా ఎన్నుకోవచ్చు. ఈ అమీర్ కేవలం ఈ జమాఅత్‌కే అమీర్. మొత్తం ముస్లిమ్ సమాజానికి అమీర్ కాదు. ఈయన విధేయ తను పాటించడం తప్పనిసరి అయ్యేది కేవలం ఈ జమాఅత్‌తో సంబంధం కలవారికే పరిమితం. ఈయనతో "బయత్" చేయని వారు (అంటే జమాఅత్ సభ్యులు కానివారు) అజ్ఞానపు చావు చస్తారు అనే భావం మా మస్తిష్కాల్లో ఎంత మాత్రం లేదు.

ఇప్పుడు దైవం సాక్షిగా చెప్పండి! మేము ఈ పద్ధతి ప్రకారం పనిచేస్తున్నప్పుడు, ముస్లిం సమాజంలో మా ఈ ఉద్యమం వల్ల ఒక కొత్త వర్గం ఎలా ఉనికిలోకి వస్తుందో? విచిత్రం ఏమంటే ఎవరయితే తప్పులన్నింటిలో మునిగితేలు తున్నారో, ఎవరివల్లనయితే వర్గాలు, చీలికలు ఉపద్రవంలా ముంచుకువస్తున్నాయో, ఎవరిమధ్యనైతే స్వప్నాలు, మహిమలు మహాత్మ్యాల ఆధారంగా ప్రచారం కొనసాగుతుందో, ఎవరి కార్యకలాపాలయితే ఎవరో ఒక "హజ్రత్"గారి వ్యక్తిగత భక్తి ఆధారంగా కొనసాగగలుగుతాయో, ఎవరి మధ్యనయితే ఒక ప్రత్యేక వ్యక్తి కోసం ప్రత్యేక స్థానం ఉండాలనే వాదన జరుగు తుందో, ఎవరయితే చిన్న చిన్న సమస్యలను గోరంతలు కొం డంతలుగా చేసి, నిమ్న విషయాలకు ప్రాధాన్యతనిచ్చి వివాదాలు, వాదోపవాదాలు నడుపుతున్నారో, వాటి ఆధారంగా వర్గాలుగా విడిపోతున్నారో వారే మమ్మల్ని నిందించడంలో ముందు ఉంటున్నారు. ఎవరయినా మరోలా భావించ

రంటే నేనొక మాట చెప్పదలిచాను. ఇలా వారి ఆగ్రహానికి కారణభూతమయిన, మేము చేసిన అసలు నేరం వారు నోటితో చెప్పేది కాదు, అసలు నేరం ఏమిటంటే మేము ధర్మం చూపే అసలు ధ్యేయం వైపుకు పిలుపునిచ్చాము. అదే వారి మనస్సులకు రుచించటం లేదు. ఈ ధ్యేయసాధనకై మేము సరయిన పద్ధతిని అవలంబించాము. తద్వారా వారి పద్ధతుల్లోని తప్పులు ఒక్కొక్కటే బయటపడసాగాయి. ఇదీ వారి అసలు బాధ. వారు చెప్పే మరో విషయం ఏమిటంటే మీరు ఈ పనే చెయ్యదలిస్తే చెయ్యవలసింది కాని, దానికై వేరే ఒక సంస్థ ప్రత్యేక పేరుతో స్థాపించే అవసరమేముండింది ? దీనివల్లనయితే ముస్లిం సమాజంలో విభేదాలు ఉత్పన్నమవుతున్నాయి. చాలా విచిత్రమయింది ఈ ఆక్షేపణ. నాకు కలిగే ఆశ్చర్యమేమంటే, ధర్మరహితమయిన లేక ధర్మవిరుద్ధమయిన రాజకీయాల కోసం, ఇస్లామేతర విద్య కోసం, మత సంబంధమయిన వర్గాలను సృష్టించటం కోసం ఇంకా పూర్తిగా ప్రాపంచిక లక్ష్యాల కోసం పాశ్చాత్యుల ప్రజాస్వామ్య లేక ఫాసిస్టు విధానాల ప్రకారం ముస్లింల సంఘాలు, సంస్థలు ప్రత్యేక నామధేయాలతో వెలిసినప్పుడు వాటిని చల్లని గుండెలతో భరిస్తారు. కాని అదే ధర్మం యొక్క అసలు కార్యకలాపాల కోసం స్వచ్ఛమయిన ధార్మిక సూత్రాల ప్రకారం ఒక సంస్థ వెలిస్తే వెంటనే ముస్లిం సమాజంలో విచ్ఛిన్నత ఏర్పడే ప్రమాదం ముంచుకువస్తుంది. కేవలం ఈ సంస్థ నిర్మాణమే సహించరానిదిగా తయారవుతుంది. ఇట్టి ఆక్షేపణలు చేసేవారికి కోపం, అసలు సంస్థ నిర్మాణంకన్నా, ఒక సంస్థ అసలు ధార్మిక ధ్యేయం కొరకు ఉనికిలోకి రావడం వల్లనే వస్తుందన్న అనుమానం కలుగుతుంది. అయినా వారితో

చేము మనవి చేసుకునేదేమంటే జమాఅత్‌ని మేము గత్యంతరం లేకనే నెలకొల్పవలసి వచ్చింది– ఏదో ఉబుసుపోక కాదు. ఈ జమాఅత్ నిర్మాణానికి పూర్వం సంవత్సరాల తరబడి నేను ఒంటరిగా ఎలుగెత్తి పిలుస్తూ ఉన్నాను– "ముస్లిమ్‌లారా! మీరు ఏ మార్గాలపై మీ శక్తులన్నిటినీ, మీ ప్రయత్నాలన్నిటినీ వెచ్చిస్తున్నారు? మీ అసలు కర్తవ్యమయితే ఇది. దీనికై మీ ప్రయత్నాలన్నింటినీ కేంద్రీకరించండి! నా ఈ పిలుపును ముస్లింలందరూ స్వీకరిస్తే ఇక చెప్పేదేముంది? ముస్లింలలో ఒక జమాఅత్ అంటూ ఏర్పడే బదులు ముస్లింలందరిదీ ఒకే జమాఅత్ ఏర్పడి ఉండేది. కనీసం భారత దేశం మేరకు అది "అల్ జమాఅత్"గా రూపొందేది. అది ఉండగా మరో జమాఅత్‌ను నిర్మించటం ధర్మం ప్రకారం (హరామ్) నిషిద్ధమయ్యేది. అలా కాక కనీసం ముస్లింల అనేక సంస్థల్లో ఏ సంస్థ నయినా సరే ఆ పిలుపును తన ధ్యేయంలా స్వీకరించి ఉంటే అప్పటికీ మేము దాన్ని ఒప్పుకొనే వాళ్ళమే, మేమే అందులో సంతోషంగా చేరిపొయ్యేవాళ్ళం. కాని మేం పిలిచీ పిలిచీ అలసిపోయి అది ఎవరి చెవికీ ఎక్కకపోవడం మూలాన, గత్యంతరం లేక ఒక నిర్ణయం గైకొన్నాము ఈ కర్తవ్యాన్ని సత్యమయినదిగా గుర్తించి దాన్ని తమ విధిగా భావించే వారంతా ఒక చోట చేరి, ఈ లక్ష్యసాధనకై సామూహిక కృషి సలపాలని నిర్ణయించుకున్నాము."

ఇప్పుడు ప్రశ్న ఏమిటంటే మేము ఇది కాకపోతే ఏది చెయ్యవలసి ఉండేది? ఒకవేళ ఈ కార్యం "విధి" కాదని మీరు భావిస్తే మీ వాదనకు హేతువును సెలవియ్యండి. దీనిపట్ల

మీకు తిరస్కారభావం లేకపోతే మీరు ఏర్పరచుకున్న వివిధ సంస్థలు, సంఘాలు ఈ విధినే నిర్వహిస్తున్నాయా చెప్పండి. అదీ కాదంటే, కర్తవ్యాన్ని గుర్తించి దాన్ని నిర్వహించటానికి కంకణం కట్టుకున్నవారే నేరస్థులుగా నిర్ణయమయ్యే దశకు దిగజారిపోయారా మీరు ?

మీ జమాఅత్ లీడర్‌ని "అమీర్" అని ఎందుకు అంటున్నారు ? అమీర్ లేక ఇమాం అనేవాడు సర్వాధికారాలుగల వాడు, సేనగలవాడే కదా?" అని మమ్మల్ని ప్రశ్నిస్తున్నారు, కొన్ని హదీసుల్ని కూడా దీనికి ఆధారాలుగా చూపించి. ఇమామత్ అంటే ధార్మిక విద్యా బోధకుడు లేక నమాజ్‌ను చేయించేవాడు లేక జిహాద్‌లో, యుద్ధాలో సైనికుల్ని నడిపించే వారికే చెల్లుతుంది. ఇది తప్ప మరో రకం ఇమామత్ ఏదీ లేదని అక్షేపిస్తున్నారు. ఇలా అక్షేపించేవారికి కేవలం ఇస్లామీయ రాజకీయ వ్యవస్థ సుస్థాపితమయి, సేనగల ఇమామత్ ఏర్పడినప్పటి హదీసుల ఫికహ్‌లు మాత్రమే తెలుసు. కాని సేన లేనప్పుడు, ముస్లిమ్ సమాజం అధికారాన్ని కోల్పోయినప్పుడు ఇస్లామీయ సంఘ వ్యవస్థ ఛిన్నాభిన్నమయినప్పుడు - ఆ స్థితిలో ఆదేశాలేమిటి ? అని వారిని నేను అడుగుతున్నాను. ఇంకా ఇలాంటి పరిస్థితుల్లో ముస్లిములు ఎవరికివారు వేర్వేరుగ కూచొని ఓ దైవమా ! ఒక సేనగల ఇమామ్‌ను పంపించవూ అని దైవాన్ని వేడుకుంటూ ఉండాలా ? లేక ఇలాంటి ఇమామత్‌ను నెలకొల్పేందుకు సామూహిక కృషి ఏదయినా చేయవలసి ఉందా ? ఇలాంటి సామూహిక కృషి జరగాలని వారంటే, ఏ సంస్థనూ ఏర్పరచకుండా సామూహిక కృషి

ఏదయినా జరపడం ఎలా సాధ్యమవుతుందో వారే దయచేసి మాకు తెలుపవలసి ఉంటుంది. సంస్థను నెలకొల్పడం తప్ప గత్యంతరంలేదని వారు ఒప్పుకుంటే, సంస్థ, నాయకుడు, నిర్వహణాధికారి ఆజ్ఞలనిచ్చేవాడు లేకుండా ఎలా ముందుకు సాగగలదు? ఈ అవసరాన్ని వారు ఒప్పుకుంటే, ఇస్లామీయ లక్ష్యసాధన కోసం నిర్మింపబడిన ఇస్లామీయ సంస్థను నడిపే వ్యక్తి విషయంలో ఇస్లామ్ ఎలాంటి పారిభాషిక పదాన్ని ప్రతి పాదిస్తుందో వారే సెలవిస్తే బావుంటుంది. వారు ఏ పదాన్ని సూచిస్తే దాన్నే మేము స్వీకరిస్తాము. అయితే అది ఇస్లామీయ పారిభాషిక పదమయి ఉండాలి! ఇదంతా కాదంటే వారికి స్పష్టంగా ఒక మాట చెప్పివెయ్యాలి, ఇస్లామ్‌లో అధికారం ఉన్న స్థితిలో పనికివచ్చే ఆదేశాలయితే ఉన్నాయి కాని అధికారం లేని స్థితిలో అధికారాన్ని ఎలా సంపాయించాలి? అన్న విషయానికి సంబంధించిన ఆజ్ఞలు లేనేలేవు, అందువల్ల ఈ కార్యాన్ని చెయ్యదలిచేవాడు ఇస్లామ్ విరుద్ధ పద్ధతుల్లో, ఇస్లామేతర పారిభాషిక పదాలనుపయోగించి చెయ్యాలి అని తేల్చి చెప్పాలి. ఒకవేళ ఈ మహానుభావుల భావం ఇదీ కాదంటే మాకు ఈ విషయం మటుకు అర్థంకాని పజిల్‌గా తయారయింది, అధ్యక్షుడు. నాయకుడు, నేతలాంటి పదాల్ని వాడినట్లయితే అవన్నీ వారికి సమ్మతమే కాని "అమీర్" అనే ఇస్లామీయ పదం వాడితే మాత్రం వారికి అరికాలి మంట తల కెక్కుతుంది.

సామాన్యంగా ప్రజలకు ఈ సమస్యను అర్థం చేసుకోవ డంలో ఎదురయ్యే చిక్కు ఏమిటంటే, మహాప్రవక్త (సఅసం)

కాలంలో "అమీర్" లేక "ఇమాం" అనే పదాలే వాడబడేవి. అప్పుడు ఇస్లామీయ ప్రభుత్వం స్థాపితమయింది. అయితే ఇస్లామీయ ప్రభుత్వం నెలకొనక పూర్వం స్వయంగా ప్రవక్త మహనీయులే (సఅసం) ధర్మసంస్థాపనా కృషికి నాయకత్వం వహించారు. అందువల్ల అమీర్ లేక ఇమామ్ అనే పదాలను ప్రయోగించే అవసరమే కలగలేదు. కాని ఇస్లామ్ ప్రతిపాదించే వ్యవస్థనంతటినీ పరిశీలిస్తే తెలిసేదేమంటే, ఈ ధర్మం, ముస్లిముల ప్రతి సామూహిక కార్యంలోనూ క్రమబద్ధతను కాంక్షిస్తుంది. ఈ క్రమబద్ధతకై అది సూచించే సరయిన పద్ధతి ఏమంటే, ఒక జమాఅత్(సంస్థ)గా ఏర్పడి పని చెయ్యాలి. జమాఅత్‌లో ఆదేశాలివ్వడం, వాటిని పాటించడం జరగాలి. సంస్థ (జమాఅత్)కు ఒక అమీర్ ఉండాలి. నమాజ్ చేసినా, "జమాఅత్"తోనే చెయ్యాలి. దానికి ఒక ఇమామ్ కావాలి. హజ్ చేసినా క్రమబద్ధంగా చేయాలి. దానిగ్గాను అమీరె హజ్ అంటూ ఒకరుండాలి. చివరికి ముగ్గురు వ్యక్తులు ప్రయాణార్థం బయలుదేరినా వారు కూడా క్రమబద్ధంగానే ప్రయాణం చేయాలి. వారు తమలో ఒకరిని తమ అమీర్‌గా ఎన్నుకోవాలి "ముగ్గురు వ్యక్తులు ప్రయాణార్థం బయలుదేరినప్పుడు వారిలో ఒకడు వారిపై నాయకునిగా ఉండాలి." (హదీసు-అబూదావూద్

ఇస్లామీయ షరీఅత్‌లోని ఈ భావ సారాన్ని హజ్రత్ ఉమర్ (రజి) తన మాటల్లో ఈ విధంగా నుడివారు.

"జమాఅత్ (సంఘటిత వ్యవస్థ) లేకుంటే ఇస్లామ్ లేదు ఇమారత్ (నాయకత్వం) లేకుంటే జమాఅత్ లేదు మరియు విధేయత లేకుంటే ఇమారత్ (నాయకత్వం) కూడా లేదు".

కాబట్టి మా వాదన ఏమంటే ధర్మ సంస్థాపనం మరియు సత్యసాక్ష్యం కోసం ఏ జమాఅత్‌నయితే నెలకొల్పడం జరుగుతుందో దాని నాయకునికి అమీర్ లేక ఇమాం అని చెప్పటం సరయినదే. కాని ఇమాం అనే పదానికి కొన్ని ప్రత్యేకమయిన అర్థాలు ఆపాదించడం జరగడం వల్ల, ఉపద్రవాలను తప్పించుకోడానికి ఆ పదాన్ని వదిలేసి అమీర్ అనే పదాన్ని మేం వాడుతున్నాము.

ఇంకో విచిత్రమయిన ఆక్షేపణ ఏమంటే, ఈ విధంగా ఎన్నుకోబడిన నాయకుడిని జకాత్‌ను వసూలు చేసే ఎలాంటి అధికారంలేదు అన్నది. ఎందుకంటే జకాత్ కేవలం ఇస్లామీయ రాజ్యాధినేత మాత్రమే వసూలు చేయగలడు జకాత్‌ను వసూలుచేయడంలో మేము అవలంబించే పద్ధతి బహుశః వారికి తెలియకపోవచ్చు. మేము సామాన్యంగా ముస్లిములందరూ వారి వారి జకాత్‌ను మా బైతుల్ మాల్ (ధనాగారం)లో జమ చెయ్యాలని మేము కోరడం లేదు. ఇంకా, ఏ ముస్లిమ్ అయితే మా బైతుల్ మాల్‌లో జకాత్ చెల్లించడో అతని జకాత్ చెల్లింపు విధి నెరవేరదని కూడా మేమెన్నడూ అనలేదు. మేము కేవలం మా జమాత్ సభ్యులను మటుకే తమ జకాత్‌ను జమాఅత్ బైతుల్ మాల్‌లో జమ చేయాలని కోరుతాము. ఇలా చేయడంలో మా ఉద్దేశ్యం ఏమంటే ముస్లింలకు షరీఅత్ ప్రకారం సామూహికంగా జకాత్‌ను జమ, ఖర్చు అలవడాలన్నదే మేమిలా చేస్తున్నందువల్ల షరీఅత్ ప్రకారం ఏ అపరాధం జరుగుతుందో, ఏ షరీఅత్ ఆదేశానికి ఇది విరుద్ధమో మాకు దయచేసి ఎవరయినా తెలిపినట్లయితే బావుంటుంది.

ఒకవేళ ముస్లిములు నమాజ్ వేరు వేరుగా ఇండ్లలో చెయ్యకుండా సామూహికంగా మస్జిదులలోనే చెయ్యాలి అని చెప్పడంలో మాత్రం తప్పులేకపోతే, జకాత్‌ను వ్యక్తిగతంగాకాక సామూహికంగా చెల్లించమని కోరడంలోగల తప్పేమిటి? ఎంత విచిత్రం! చందాలు వసూలు చేయడం సమ్మతమే, సభ్యత్వ రుసుమంటూ తీసికోవడం కూడా సబబయినదే కాని దైవం మరియు దైవ ప్రవక్త (సఅసం) విధించిన దాన్ని నెరవేర్చే పిలుపునిస్తే అది మాత్రం ఆమోదయోగ్యం కాదు!

ఇంతకంటే విచిత్రమయిన ఆరోపణ ఏమంటే, మీరు "బైతుల్‌మాల్"ను ఎందుకు నెలకొలిపారు అన్నది— ఇలాంటి ఆక్షేపణల్ని విని వీరికి ఇస్లామీయ పదాలంటేనే విద్వేషమేమో అనిపిస్తుంది. ప్రతి జమాఅత్ (సంస్థ) లేక ప్రతి సంఘం తన సామూహిక పనుల్లో ధనాన్ని వెచ్చించటానికి తనదంటూ ఒక నిధిని ఏర్పరచుకుంటుంది. మా జమాఅత్ కూడా ఒక నిధిని ఏర్పరచుకుంది. దాన్నే మేము ఇస్లామీయ పరిభాషలో బైతుల్‌మాల్ అంటున్నాము. దాన్ని మేము ఏదో నిధి అన్నా Treasury అన్నా వారు సంతోషించేవారు, కాని దానికి ఇస్లామీయ పదం వాడితేనే వారు భరించలేకపోతున్నారు.

ఈ ఆక్షేపణల్లో చాలా మటుకు తలాతోకా లేనివే. వాటిని ప్రస్తావించి, వాటికి సమాధానాలిచ్చి శ్రోతల సమయాన్ని వృధా చెయ్యడం నాకు ఇష్టమయ్యేది కాదు. కాని నేను ఈ కొన్ని విషయాలు కేవలం నమూనాలుగా మీ ముందుంచాను— ఎవరయితే స్వయంగా తాము తమ బాధ్యతను

నెరవేర్చటానికి ముందుకు రారో ఇంకా ఇతరుల ఆ బాధ్యతను తెరవేర్చనివ్వరో వారు ఎలాంటి సాకులు, ఆక్షేపణలు, సంశయాలు వెదకి వెదకి తీసుకువస్తారో ఇంకా ఎలా దైవ మార్గం నుండి స్వయంగానూ దూరంగా ఉంటూ ఇతరుల్ని దానికి దూరం చేస్తారో చూపడానికి, మా పద్ధతిలో వాదోపవాదాలు, తర్కోపతర్కాలు లేవు. ఎవరయినా మా మాటను సవ్యంగా అర్థం చేసుకోదలిస్తే మేము దానికి నిత్యం సిద్ధమే. ఎవరయినా మా తప్పును సమంజస రీతిలో మాకు తెలుపదలిస్తే దాన్ని అర్థం చేసుకోవడానికి మేము సిద్ధమే. కాని ఎవరయినా కుతర్కానికి దిగి కేవలం కలహ సృష్టికి పాల్పడినట్లయితే అలాంటి వారి జోలికి మేము పోదలచుకోలేదు. అలాంటివారికి, తమ ఈ "సత్కార్యం"లో ఇష్టమయినంత కాలం నిమగ్నులయి ఉండటానికి హక్కుంది.

చివరిగా మేము పలికేది ఒక్కటే:

సకల స్తోత్రాలు సర్వలోక ప్రభువుకే.

